Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

పెంచండి దేహారోగ్యం...

పంపినవారు :
ఎస్. కామేశ్వరరావు, ఏనుగులమహల్

# చందమామ

## ఈ సంచికలో కథలు
## వింతలు - విశేషాలు







ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైనవి మరి ఎన్నో ఆకర్షణలు

ఫౌంటెన్ కలములకు,
సిరాలకు
జగత్ప్రసిద్ధి పొందిన
పేరు

## పైలట్

మరల ఇప్పుడు
భారతదేశములో
ప్రతి చోట
లభించుచున్నవి

*

నాణ్యమునకు
పూచీ

MANUFACTURED BY
**THE PILOT PEN CO. (INDIA) LTD.**
CATHOLIC CENTRE, MADRAS-1.

---

డేంగ్రే
బాలామృతము

కె.టి.డేంగ్రే అండు కంపెనీ
బొంబాయి-4.

---




## ఆంధ్రుల చరిత్ర సంస్కృతి

ప్రతి ఆంధ్రుడు చదువ తగిన సద్గ్రంథము. ఆంధ్ర రాష్ట్ర సాధనకు మిక్కిలి తోడ్పడిన గ్రంథము.

పే. 500. వెల రు. 6 0 0




## బాలసరస్వతి పిక్టోరియల్ మీడియం డిక్షనరి

( ఇంగ్లీషు—ఇంగ్లీషు—తెలుగు )

విద్యకు, విజ్ఞానానికి, పరీక్షలో విజయానికి ఈ డిక్షనరీ పుపయోగపడుతుంది. 1000 పేజీలు. పూర్తి క్యాలికో బైండు

| | |
|---|---|
| మీడియం ధర | 9 0 0 |
| జెం డిక్షనరీ ధర | 4 8 0 |




## గానకళాబోధిని

అపూర్వ సంగీత గ్రంథము. గొప్ప అనుభవజ్ఞులచే రచింపబడినది. సంగీతము నేర్చుకొనుటకు, సాధనకు, పరీక్షలకు పిన్నలకు పెద్దలకు ఉపయుక్తపడు గ్రంథరాజము.

పే. 1000. రు. 10 0 0

తమ ఆర్డరుతోపాటు అడ్వాన్సు పంపవలెను.

వలయువారు: **బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు.**
బ్రాంచి: నెం. 6, సుంకురామచెట్టి వీధి, మద్రాసు.


రమేశ్ ఇంటికి
వెళ్లుటకు భయపడ్డాడు...






నా బట్టలను మాపుకొన్నాను, రామ్. మా అమ్మ నన్నిప్పుడు తిట్టుతుంది.
రమేశ్, నేను-కూడా తరచుగా బట్టలను మాపు-కొంటుంటాను గాని మా అమ్మ నన్నెప్పుడూ తిట్టదు, రావోయ్.


రామ్ ఇంటివద్ద:
ఎందుకతనేడుస్తున్నాడు?
అతడింటికి వెళ్లు-టకు భయపడుచు న్నాడు, ఎందుకంటే అతడు తన బట్టలను మాపుకొన్నాడు.


రమేశ్ ఇంటివద్ద:
మళ్లీ మురికిగా ఇంటి కొచ్చావు! నిన్నింక యెప్పుడూ ఆటకు బైటకు వెళ్లనియను!
ఈ బాలుని తిట్టకమ్మా-పిల్లలందరూ ఆడునప్పుడు మురికిగా నగుదురు.


ప్రతిరోజూ వాడి బట్టలను ఉతుకుటకు చెమట వోడుస్తున్నాను వాటిని బాదుతూ అందుకని చాలాత్వరగా చిరిగి పోతున్నవి.


అది నిజమే, బాదుట బట్టల పోగులను తెంచును మరి అందు-వల్లనే బట్టలు త్వరగా చిరిగి పోవును.
బాదబడినబట్ట పెద్దదిగా చూపబడినది


కాని మీరు సన్‌లైట్ సబ్బుతో ఉతికినప్పుడు బట్టలను బాదనక్కర్లేదు దాని సమృద్ధయిన నురగను-రికినంతటిని సులభంగా తొల-గించును, ఆవిధంగా మీ బట్టలు చాలాకాలము మన్నును కూడ.


అది నిజం! త్వరగా నురగను గలిగించు సన్‌లైట్ సబ్బు బట్టలను బాదకుండానే సరిగ్గా తెల్లగాను మరియు కాంతివంతముగాను ఉతుకును. అంటే – బట్టలు చాలాకాలము మన్నును మరియు నాణ్యత దబ్బు మిగులును.




SUNLIGHT
SOAP

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లైయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లైయింట్లు గమనించబడవు.

మేనేజరు

ఫ్లాష్ అవసరం లేని

కొత్త

# GEVAPAN 36°

## గెవాపాన్ 36°

అతి వేగవంతమైన రోల్ ఫిలిం
మసక వెలుతురును కూడా
మహ బాగా వాడుకుంటుంది.




ఫొటోగ్రఫీలో ఎంతెంతో మంచి పద్ధతులు కనుక్కోవాలని గెవర్టువారు శాస్త్రపరిశోధనలు చేసిన ఫలితమే "గెవాపాన్" 36°—అన్ని రంగులనూ వేగంగా గ్రహించగల హైస్పీడ్ రోల్ ఫిలిము. ఈ ఫిలిం ప్రత్యేకించి, వెలుతురు సరిగా లేని సమయంలో-అనగా మబ్బు పట్టినప్పుడూ మసక వెలుతురులోనూ ఉపయోగింపతగ్గది. కొన్ని రకాల పగటి కాంతికీ కృత్రిమ కాంతికీ 'ఫ్లాష్' అక్కరలేకనే దీని నుపయోగింపవచ్చును. "గెవాపాన్" 36° ఫిలిముకు ఎటువంటి స్పెషల్ డెవెలపర్‌తోనూ పనిలేదు. కొద్దిపాటి ఎక్స్‌పొజర్స్‌తో-అనగా వేగంగా కదులుతూన్న మనుషుల్నిగాని, వస్తువుల్నికాని తీయటానికీ, దూరపు దృశ్యాలూ, దగ్గర దృశ్యాలూ ఒకేసారి ఫోకస్‌లో వుండేటందుకుగాను చిన్న "ఎపర్చర్స్" వాడడానికీ "గెవాపాన్" 36° అత్యుత్తమమైనది.



120, 620 రెండు సైజులలో ఉన్నవి.

**Allied Photographics Limited**

ఎలైడ్ ఫొటోగ్రాఫిక్స్ లిమిటెడ్,
కస్తూరి బిల్డింగ్స్, జంషెడ్జీ తాతా రోడ్, బొంబాయి-1.

ప్రతి శుక్రవారమూ రాత్రి 8-00 గంటలకు (41 మీటర్‌బాండు)
సిలోన్ రేడియోమీద ఎ. పి. ఎల్‌వారి 'ఫొటో-మేలా' వినండి.



# మల్టీకలర్

ఫొటో ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లోనూ,
ప్రోసెస్ బ్లాకులు తయారుచేయుటంలోనూ
సరికొత్త యంత్ర పరికరాలతో
విశేషమైన అనుభవం గల నిపుణులతో

**ఆర్టిస్టులతో, టెక్నిషియనులతో**
**30" × 40" కెమెరా సహాయంతో**

అత్యున్నత ప్రమాణాలను ఎల్లప్పుడూ
నిలబెట్టగల ఏకైక ఆంధ్ర సంస్థ
క్యాలెండర్లకు చక్కని నమూనాలకు,
ముద్రణనుగూర్చి అడగండి.)

## ప్రసాద్ ప్రోసెస్ లిమిటెడ్,

చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26

ఏ విధమయిన అచ్చుపనులైనను
అతి చక్కగా...
అనుకొన్న గడువులో
మేము చేసి యివ్వగలము!

★

మా ముద్రణశాలకు తోడుగా చిత్రకళాశాఖ,
బ్లాకు తయారీశాఖ, లితో-అఫ్‌సెట్
సంస్థలు సమకూడివున్నవి.

★

దిబి. ఎన్. కె. ప్రెస్ లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26

ఫోన్: 88474






'గంటల తరబడి

ఆనందమునకు




టాయిలెట్ సబ్బును వాడండి'

అని ఎ.కె. మువీస్ చిత్రము 'షిర్న'లో నటిస్తున్న
గీతా బాలీ మరియు షమ్మీ కపూర్ అంటున్నారు.

ఒక నిజమైన స్వదేశీ సబ్బు

తాతా ఆయిల్ మిల్స్



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఆదర్శప్రాయుడైన గురువు తన శిష్యులకు విజ్ఞానాన్ని కలిగించటంతోబాటు వివేకమూ, నీతివర్తనమూకూడా అలవడేలాగు చూడాలి.

"గురుబాధ్యత" అన్న జాతక కథలో కాశీరాజ కుమారుడు శిల్పాచార్యుడివద్ద విద్యాభ్యాసానికి వెళతాడు. అక్కడ వుంటూ ఒక ముసలిదాని నువ్వులు దొంగతనంగా తింటాడు. ఈ అవినీతికిగాను శిల్పాచార్యుడు అతన్ని దండిస్తాడు. గురువు తన మంచికొరకే తనను దండించాడని రాజకుమారుడు గ్రహించలేక, తాను రాజు కాగానే శిల్పాచార్యుణ్ణి పిలిపించి చంపటానికి ఆలోచనచేస్తాడు. తాను చేసిన నువ్వుల దొంగతనం నిండు సభలో నిర్భయంగా శిల్పాచార్యుడు బయట పెట్టేసరికి రాజు సిగ్గుతో కుంగిపోతాడు.

మార్చి
1956



సంపుటి 18
సంచిక 3

# ఉత్తుత్తి గేదె కథ

అనగనగా ఒక ఊళ్లో
ఉన్నా డొక రైతు.
ఉత్తుత్తిగ గడుసువాడు
స్వతహాగా బైతు.

అన్నా డొకనాడు వాడు
తన భార్యను పిలిచి,
"పాడిగేదె నొక దానిని
కొనాలనుచు తలచి

నీ సలహా అడుగుతాను,
ఏమంటావ్ చెప్పు ?"





"చెప్పడానికేమున్నది ?
కొనం డదే ఒప్పు,"

అని కళత్ర మనగానే
"అయితే గియితే గేదెను
పిలిచిన తరువాతను
పాలు పెరుగు ఏంచేస్తావ్?"

"పెద్దకుండలో పాలు,
చిన్నకుండలో పెరుగు,"
అనెనా ఇల్లాలు.
"పాలు మిగిలిపోతేనో ?"

"మావాళ్లకి యిస్తాను,"
"యిస్తావా ? యిస్తావా,"





( గే య క థ )

రైతు పట్టి బైతయినా
అతి తెలివికిపోయి, "భార్య

కొత్తగేదె పాలన్నీ
పుట్టింటికి చేర్చె,"ననె.
"అయితే మా బావగారు
కొనని గేదె, నేను వేయని

చేను మేసిపోయె,"సనుచు
బావమరిది నవ్వగనే;
ఉత్తగేదె కథగ తెలిసి
పెద్దలెల్ల నవ్విరి!

అని యాతడు రెచ్చిపోయి
అంగట్లో గేదెను

బాదినట్లు తన భార్యను
జాలిమాలి బాదెను.
ఆమె వెళ్లి జరిగిన కథ
అన్నతోడ చెప్పెను.

అతడువచ్చి బావగార్ని
పట్టికొట్ట సాగెను.
అందరు గుమికూడి వచ్చి
"ఎందుకు వచ్చిన తగ"వన

"నా చెల్లిని కొట్టెనితడు
ముందువీని నడుగం,"డనె.





# అట్టమీది బొమ్మ

పాండవులు మాయజూదంలో ఓడిపోయి అరణ్యవాసంచేస్తున్న సమయంలో కర్ణుడు దుర్యోధనుడికి ఒక దుర్బుద్ధి కలిగించాడు. పాండవులు అరణ్యవాస దుఃఖం అనుభవించే ఈసమయంలో మనం మహావైభవంగా వారికి కనిపించాలి. అందుకని మనం అరణ్యంలో మన పశువుల మందల యోగక్షేమాలు విచారించే మిషపెట్టి బయలుదేరుదాము," అని కర్ణుడు దుర్యోధనుడికి సలహా ఇచ్చాడు.

దుర్యోధనుడు తనవెంట శకుని కర్ణులనూ, దుశ్శాసనాది సహోదరులనూ, అంతఃపురకాంతలనూ, అంతులేని రథగజతురగపదాతి సేనలనూ వెంటబెట్టుకుని, పాండవులుండే ద్వైతవనానికి బయలుదేరి ఒక సరస్సు ఒడ్డున విడిదిచేశాడు.

ఆ సరస్సుకు అవతలి గట్టున పాండవులున్నారు. ఆసమయాన ధర్మరాజు ఒక యజ్ఞం ఆరంభించబోతూ ఉన్నాడు. దుర్యోధనుడి పరివారం సరస్సు తీరాన విడుదులు నిర్మించబోయే సమయంలో కొందరు గంధర్వులు వచ్చి, "మా రాజు చిత్రసేనుడు తన భార్యలతో ఈ గట్టునే విడిదిచేసి ఉన్నాడు. కనుక మీరిక్కడ నిలవటానికి వీలులేదు," అన్నారు.

ఈ మాటలు విని దుర్యోధనుడు మండిపడి చిత్రసేనుడి భటులపైకి తన సైనికులను ఉసికొల్పాడు. వారు వెళ్ళి తమ రాజుతో జరిగినసంగతి చెప్పారు. చిత్రసేనుడు వెంటనే బయలుదేరి యుద్ధానికి వచ్చాడు. అతను ఒక్క సమ్మోహనాస్త్రంతో దుర్యోధనుడి బలాలన్నిటినీ కాళ్ళు చేతులు కదలకుండా చేసి, దుర్యోధనుణ్ణి పెడరెక్కలు విరిచికట్టి, తీసుకుపోసాగాడు.

అప్పుడు దుర్యోధనుడి భటులు ధర్మరాజువద్దకు పరిగెత్తి, "మహాప్రభో, రక్షించండి! మా దుర్యోధనమహారాజును గంధర్వులు పట్టుకుపోతున్నారు!" అని మొరపెట్టారు. "కాగల కార్యం గంధర్వులే చేశారు!" అన్నారు భీమార్జునులు.

కాని ధర్మరాజు తమ్ములతో, "అది పొరపాటు. మనకూ కౌరవులకూ మధ్యగల వైరంలో వారు నూరుగురూ, మనం ఐదుగురమూ. అదే పరాయి వాడితో వైరమైనప్పుడు మనమంతా కలిసి నూట అయిదుగురం! అందుచేత మీరు వెంటనే వెళ్లి దుర్యోధనుణ్ణి విడిపించుకు రండి!" అన్నాడు.

భీమార్జునులు బయలుదేరి వెళ్లి చిత్రసేనుడితో యుద్ధంచేసి గెలిచి దుర్యోధనుణ్ణీ, అతని అంతఃపుర స్త్రీలనూ విడిపించారు. "ఎన్నడూ అలాటి సాహసాలు చేయకు!" అని ధర్మరాజు దుర్యోధనుడికి హితబోధచేసి పంపేశాడు.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో, బోధిసత్వుడు తక్షశిలానగరంలో ఒక గొప్ప శిల్పాచార్యుడుగా జన్మించాడు. అయనవద్ద శిల్పవిద్య అభ్యసించటానికి దేశం నాలుగుమూలలనుంచీ అనేకమంది రాజకుమారులు వస్తూండేవాళ్లు.

తక్షశిలా నగరపు శిల్పాచార్యుడి ఖ్యాతి విని కాశీరాజు తన కుమారుణ్ణికూడా విద్యాభ్యాసానికిగాను అయనవద్దకు పంపటం మంచిదని నిర్ణయించాడు.

పదహారేళ్ళు సరిగా నిండని రాజకుమారుడు ఒంటరిగా, దూరాన వున్న తక్షశిలకు వెళ్లి, అక్కడ గురు శుశ్రూష చేసి విద్య అభ్యసించటం మంత్రులకూ, సామంతులకూ ఇష్టం లేకపోయింది. "మహారాజా, శిల్పవిద్యలో ఉత్తీర్ణులైనవారు మన నగరంలో లేరా? అబ్బాయిగారిని తక్షశిలకు పంపటం దేనికి?" అన్నారు వాళ్లు.

రాజు ఈ సలహా ఆమోదించలేదు. ఎందుకంటే, రాజకుమారుడి హోదాలో నేర్చుకున్న విద్య రాణించదు. దూరదేశం వెళ్ళి, సామాన్య మానవుడిలాగా కష్టసుఖాలు అనుభవిస్తూ, గురువుకు అణిగి మణిగివుండి నేర్చిన విద్య ఒక్కటే ఎవరికైనా బాగా వంటపట్టుతుంది.

అందుచేత రాజు తన కుమారుడికి ఒక జత అకుజోళ్ళూ, ఒక తాటాకు గొడుగూ మాత్రం ఇచ్చి, "నువు తక్షశిలా నగరానికి వెళ్లి, శిల్పాచార్యుడి వద్ద విద్యాభ్యాసంచేసి, విద్య పూర్తికాగానే తిరిగిరా! అయనకు గురుదక్షిణగా ఇవ్వటానికి వెయ్యి వెండి కాసులు వెంటపెట్టుకు వెళ్ళు," అన్నాడు.

రాజకుమారుడు ఆ ప్రకారమే ఒంటరిగా బయలుదేరి, వెయ్యికాసులుగల మూట మోస్తూ, అలసినప్పుడు ఏ చెట్టుకిందనో విశ్రమిస్తూ, నానా అగచాట్లుపడి తక్షశిలకు






వెళ్ళి, శిల్పాచార్యులను చూసి, తాను వచ్చిన పని చెప్పి, ఆయనకు వెయ్యి వెండి కాసులూ గురుదక్షిణగా ఇచ్చి, ఆయనవద్ద విద్యాభ్యాసం ప్రారంభించాడు. రాజకుమారుడికి శిల్పవిద్య బాగానే సాగింది. అతని తెలివితేటలకు గురువు సంతోషించాడు.

కొంతకాలం గడిచింది. గురుశిష్యులు ప్రతి ఉదయమూ ఊరి వెలపల వున్న నదికి వెళ్లి స్నానంచేసి వస్తూండేవారు. ఒకరోజు వారు స్నానంచేసే సమయంలో ఒక ముసలమ్మ కొన్ని నువ్వులు తెచ్చి, నీటిలో కడిగి శుభ్రంచేసి, నది ఒడ్డున బట్ట పరిచి వాటిని ఆరబోసింది. రాజకుమారుడిది చూసి, చప్పున స్నానం ముగించి ఒడ్డుకు వచ్చి, ముసలిది పరధ్యానంగా ఉన్నట్టు కనబడిన సమయంలో గుప్పెడు నువ్వులు తీసి నోట పోసుకున్నాడు.

అయితే ముసలమ్మ ఈ సంగతి గమనించింది, కాని ఏమీ అనలేదు.

మర్నాడుకూడా అలాగే జరిగింది. ముసలమ్మ చూసీ చూడనట్టు పోనిచ్చింది మళ్లీ. మూడోనాడుకూడా అలాగే జరిగింది. కుర్రవాడి దొంగబుద్ధి చూసి ముసలమ్మకు కోపం వచ్చింది. శిల్పాచార్యుడు స్నానం ముగించి ఒడ్డుకు రాగానే ఆమె, "చూడండి, మీ శిష్యుడు మూడు రోజులుగా నా నువ్వులు అపహరించి తింటున్నాడు. నువ్వులు పోయాయని నాకు విచారం లేదు గాని, అతను దొంగబుద్ధులు అలవరుచుకోవటం అతనికి మంచిది కాదు, మీ కీర్తికీ మంచిది కాదు. అలా ఎప్పుడూ చేయకుండా శిక్షించండి," అన్నది.

శిల్పాచార్యుడు ఇంటికి వెళ్లగానే రాజకుమారుడి చేతులు గట్టిగా పట్టుకోమని మిగిలిన శిష్యులకు చెప్పి, అతని వీపుపై బెత్తంతో మూడు దెబ్బలు కొట్టి, "కూడని పని చేసినందుకు నీ కిది శిక్ష! ఇక ఎన్నటికీ చెయ్యకు!" అన్నాడు.





రాజకుమారుడికి గురువుమీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. అయితే అతను కాశీ రాజ్యం పొలిమేరలో రాజకుమారుడుగాని, ఇక్కడ సామాన్య మానవుడు. అతనిని దండించే అధికారం గురువుకున్నది.

"నేను రాజు నయాక ఈ దుర్మార్గుణ్ణి ఏదో మిషమీద కాశీరాజ్యానికి పిలిపించి, తప్పక ప్రాణాలు తీస్తాను!" అని రాజకుమారుడు అక్కస్సుకొద్దీ అప్పటికప్పుడే శపథం చేసుకున్నాడు.

కాలక్రమాన రాజకుమారుడి చదువు పూర్తిఅయింది. అతను కాశీకి తిరిగి వెళ్లిపోతూ గురువుకు నమస్కరించి ఆయన ఆశీర్వాదం పొందాడు. తరవాత అతను గురువుతో, "ఆర్యా, నేను రాజు నయాక తమరు ఒకసారి తప్పక కాశీకి దయ చెయ్యాలి. అప్పుడు నేను తమరిని యథోచితంగా సత్కరిస్తాను," అన్నాడు. గురువు సంతోషించి సరేనన్నాడు.

కాశీరాజ్యానికి తిరిగి వెళ్లిన కొంతకాలానికి రాజకుమారుడు రాజ్యాభిషిక్తుడయాడు. ఒకనా డతనికి తన గురువు విషయం జ్ఞాపకం వచ్చింది. వెంటనే అతను ఒక నౌకరును పిలిచి, "ఓరీ, నువు తక్షశిలా నగరం వెళ్లి, శిల్పాచార్యుణ్ణి కలుసుకుని,



ఆయనకు యీ ఆహ్వాన పత్రిక అందజెయ్యి!" అన్నాడు.

శిల్పాచార్యుడు ఆహ్వానం అందుకుని కూడా వెంటనే బయలుదేరలేదు. రాజు సింహాసనం ఎక్కిన మోజులో ఉంటాడు. రాజ్యభారం బరువు తెలిసివచ్చాక చూద్దామనుకున్నాడు శిల్పాచార్యుడు.

ఆ ప్రకారమే శిల్పాచార్యుడు కొంత కాలం గడిచాక కాశీనగరానికి వెళ్లి తన శిష్యుణ్ణి చూడబోయాడు. రాజుగారి గురువుగారు వచ్చారని సభాసదులు శిల్పాచార్యుడికి చాలా మర్యాద చూపించి, ఉన్నతాసనం యిచ్చారు.



గురువును చూసిన క్షణంనుంచీ రాజుకు పాత పగ జ్ఞాపకం వచ్చి కోపం పొంగి వస్తున్నది. అతను మాటల మధ్యను గురువుకేసి తిరిగి, "ముష్టి నువ్వులు పిడికెడు తిన్నందుకు శిక్షించినవాణ్ణి, చేతికి అందినప్పుడు చంపకుండా వదిలి పెడతారా?" అని అడిగాడు.

సభలో ఇంకెవ్వరికీ అర్థంకాకుండా శిల్పాచార్యుడికి చావుభయం కలిగించి, తరవాత వీలువెంట ఆయనను చంపేద్దామని రాజు ఉద్దేశించాడు.

అయితే రాజు అనుకున్నట్టు శిల్పాచార్యుడు బెదరలేదు. పైపెచ్చు ఆయన రాజు రహస్యం బయటపెట్టేశాడు.

"ఓ రాజా! నువు నా దగ్గిర శిష్యుడవుగా, నా బాధ్యతకింద వున్న సమయంలో నీ తాహతుకు తగని పని చేశావు. శిష్యుడి దుష్ప్రవర్తనను దండించి, సన్మార్గంలో ఉంచటం గురువు విధి. నిన్నానాడు నేను దండించి ఉండకపోతే నువ్వీపాటికి కాశీ రాజ్యానికి దొరగా ఉండటానికి మారుగా దొంగవై వుందువు. బుద్ధిమంతులైనవారు, తప్పు దండించినవారిపై ఎన్నడూ ఆగ్రహం పూనరు, కృతజ్ఞత చూపుతారు!" అన్నాడు శిల్పాచార్యుడు.

విషయం సభవారందరికీ తెలిసిపోయింది. రాజుకు అవమానం అయింది. అతను సింహాసనం దిగి గురువు కాళ్ళపై బడి, "మహానుభావా, మళ్లీ తప్పుదారినపడిన నా మనస్సును సరిఅయిన దారిన పెట్టారు! కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

రాజులో వచ్చిన మంచిమార్పుకు, సభాసదులతోపాటు గురువుకూడా ఎంతగానో ఆనందించాడు.

రాజు కోరికపై శిల్పాచార్యుడు తన కాపరం తక్షశిలనుండి కాశీకి మార్చి ఆస్థాన ఆచార్యుడుగా ఉండి, రాజును సరిఅయిన మార్గాన నడిపించాడు.






## 9

[శివదత్తుడు రహస్యద్వారంనుంచి పోతున్నప్పుడు, దాని రెండవ కొనను నరవాహనుడి సైనికులు ముట్టడించారు. ఆ ముట్టడిలో కొందరు శివదత్తుడి అనుచరులు మరణించారు. అప్పుడు శివదత్తుడు శత్రుముఖ్యుణ్ణి ఎదుర్కొని, అతణ్ణి చంపాడు. వాడు మరణించగానే ధైర్యం కోల్పోయిన నరవాహనుడి సైనికులు దిక్కులు చూడసాగారు. తరవాత—]

"శివదత్తా! అదృష్టదేవత మొదటినుంచీ, మిమ్ములను ఒక కంట కనిపెట్టివున్నదనే నేను భావిస్తాను. లేకపోతే, మీరు యిన్ని ప్రమాదాలనుంచి బయటపడటం, సాధ్యమయ్యేదికాదు," అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు నవ్వి, "అందుకు సందేహం లేదు. రహస్యద్వారపు రెండవ కొనను అంతమంది శత్రువులు చుట్టుముట్టివుంటారని, నేనేమాత్రం వూహించలేదు. కాని అదృష్టవశాత్తూ నా కత్తికి వాళ్ళ ముఖ్యుడు ఆహుతికాగానే, ధైర్యం కోల్పోయిన మిగిలిన నరవాహనుడి సైనికులను హతమార్చటం ఎంతోసేపు పట్టలేదు. కాని, పొదలమాటున నక్కుతూ ఒకరిద్దరు శత్రువులు పారిపోయారనేది, ఆ తరవాతగాని నాకు తెలియలేదు.

గుర్రం కింద పడిపోయిన శత్రు సైనికుణ్ణి బయటికి లాగించాను. గుర్రం మరణబాధతో అటూ యిటూ తన్నుకోవటంలో, అతడుకూడా దాని కాళ్ళ కింద పడి బాగా గాయపడి పోయాడు. కొనవూపిరితో వున్న అతడికి, యింత నీరు పోయించాను. సమరసేనుణ్ణి గురించి





"అయితే, యుద్ధంలో సమరసేనుడు గాయపడిన మాట నిజమేనన్న మాట?" అని అడిగాను.

"నిజం..." అంటూ అతడు నేలమీదకు ఒరిగి కళ్ళు మూశాడు.

'మహాసేనాని సమరసేనుడు మరిలేడు!' అన్న భావం నా గుండెలను కలిచినట్టయింది. అతడు మహావీరు డనిపించుకున్నాడు, వీరమరణం పొందాడు. అతడి ఆత్మకు శాంతి కలగాలని దేవదేవుణ్ణి ప్రార్థించాను.

ఇక ఇప్పుడు కర్తవ్యం ఏమిటి? కుండలినీదేవి కరుణవల్ల నేను అనుకున్నదానికన్న కొద్ది కష్టనష్టాలతోనే సారంగంనుంచి బయటపడ గలిగాను. శత్రువులతో జరిగిన పోరులో, నా అనుచరులు ఆరుగురు మరణించారు. నేను తక్షణం ఆ ప్రాంతం వదలి, అడవి లోపలిభాగానికి పారిపోకపోతే, నరవాహనుడి సైనికులు మరికొందరు అక్కడికి వచ్చే ప్రమాదం ఉంది.

నా అనుచరులందర్నీ ఒక చోట చేర్చి పరిస్థితి వివరించాను. ఈనాడు కాకపోతే, మరోనాడైనా, ఈ ద్వీపాన్ని వదిలిపోక తప్పదని వారందరూ అంగీకరించారు. సమరసేనుడి మరణం తరవాత, నరవాహ

నేను తెలుకోవలిసిన ముఖ్య విషయం, అతణ్ణించి తప్ప మరెవరినించీ తెలుసుకోవటం సాధ్యంకాదు.

దాహం తీర్చుకుని, కాస్త స్వస్థతగా కనబడిం తరవాత ఆ శత్రు సైనికుణ్ణి, సమరసేనుడిని గురించి ప్రశ్నించాను. అతడు ఇప్పుడు బ్రతికివున్నాడా లేడా? అదీ ఆ సైనికుణ్ణి నేనడిగిన ప్రశ్న.

మరణబాధ పడుతున్న ఆ సైనికుడు, నాకేసి దీనంగా చూస్తూ, "సమరసేనుడు చనిపోయి నాలుగైదు గంటల కాలమైంది. ఈ ద్వీపానికి ఇప్పుడు నరవాహనుడు రాజు!" అన్నాడు.





నుణ్ణి ఎదిరించే శక్తి, యిక ఈ ద్వీపంలో మరెవరికీ లేదు.

మరణించిన నా అనుచరులు అరుగురినీ ఒకే సమాధిలో పూడ్పించి, మిగిలిన వారితో దట్టంగావున్న అడవి ప్రాంతానికేసి బయలుదేరాను. ఒకటి రెండు క్రోసులు అలా ప్రయాణించిన తరవాత, మా కొక కోయగూడెం కనిపించింది. సైనిక దుస్తులతో, ఆయుధాలు ధరించివున్న మమ్ములను చూస్తూనే, ఆ గూడెంలోని పిల్లలూ పెద్దలూ పరుగెత్తుకుంటూ వచ్చి మా చుట్టూ గుంపుగా మూగారు.



"ఈ గూడెంలో మీ పెద్ద ఎవరు? ఆయనతో మాట్లాడవలసిన పనివుంది!" అని అడిగాను వాళ్ళను. నాలుగైదు నిమిషాల్లో ఒక వృద్ధుడు మాదగ్గరకు వస్తూనే, "మీ రెవరు? ఇక్కడికేం పని మీద వచ్చారు?" అంటూ నన్ను ప్రశ్నించాడు.

నేను, నా అనుచరులను చూపుతూ, "వీళ్ళందరూ బాగా దప్పిగొని ఉన్నారు. నిన్నటినుంచి భోజనంకూడా చేయలేదు. ఇందుకు మీరేమైనా సహాయం చేయగలరా!" అని అడిగాను.

వృద్ధుడు నా మాటలు వింటూనే, తతిమ్మా కోయవాళ్ళకేసి చూచాడు. మరుక్షణంలో నా అనుచరులను ఒక్కొక్కణ్ణీ, ఒక్కో కోయవాడు ఆహ్వానించి తన ఇంటికి తీసుకుపోయాడు. ఈ అడవి జాతుల అతిథి మర్యాదను చూసి నేను చాలా ఆశ్చర్యపోయాను. వృద్ధుడు నావంక చూసి నవ్వి, "మీరు నా ఇంటికి రండి. మీ అన్నపానాదుల ఏర్పాటు నేను చూస్తాను," అన్నాడు.

నేను వృద్ధుడితో కలిసి, వాళ్ళ ఇంటికి వెళ్ళాను. ఒక అరగంట సేపటికల్లా, నాకు సర్వభక్ష్యాలతో చక్కని భోజనం వడ్డించబడింది. నేను భోజనంచేసి లేచే వరకూ వృద్ధుడు నాతో వీరకమైన సంభా





షణా చేయలేదు. కాని, అతడి నిప్పు కణికల్లాంటి కళ్ళు, నన్ను గుచ్చిగుచ్చి చూడటం గమనిస్తూనే వున్నాను.

"మేము కోయలం! ఈ ఘోరారణ్యాలే మా సర్వసంపదలూ! మా పూర్వులుగానీ, మాతరంవాళ్ళంగానీ ఏనాడూ ఏ రాజరికానికీ తలవొగ్గింది లేదు," అన్నాడు వృద్ధుడు.

నేను తలవూపి ఊరుకున్నాను. అతడు చెప్పదలచుకున్న దేమిటో నాకు సూచన ప్రాయంగాకూడా అర్థంకాలేదు.

"దేశంలో వస్తున్న ప్రమాదకరమైన మార్పులు మాకు అప్పుడప్పుడూ తెలుస్తూనే ఉన్నవి. మీలో కొందరు, మా యువకులకు పెద్దపెద్ద ఆశలు చూపి తమ తమ పక్షాల చేర్చుకునేందుకు ప్రయత్నాలు కూడా చేశారు. కోయకుల పెద్దగా, నేను అలాంటివి సాగకుండా యింతవరకూ ప్రయత్నిస్తూ వచ్చాను. మీరు సైనిక దుస్తులతో యీ అటవీప్రాంతానికి రావటంలో వున్న ఉద్దేశ్యమేమిటి?" అంటూ సూటిగా ప్రశ్నించాడు వృద్ధుడు.

అప్పటిగ్గాని అతడికున్న అనుమానమేమిటో నాకర్థమయిందికాదు. అతడి అనుమానాలను తొలగించాలంటే, అన్ని వివరాలతో యదార్థమేమిటో చెప్పక తప్పదని నిశ్చయించుకున్నాను.



సమరసేనుణ్ణి గురించీ, అతడితో నాకు మంత్రాలదీవిలో పరిచయం అయిన తీరూ, ఆ తరవాత కుండలినీ ద్వీపంలో వచ్చిన మార్పులూ, చివరకు నరవాహనుడి దుష్టపాత్రా—అంతా నాలుగు మాటల్లో కోయకుల పెద్దకు వివరించాను. అంతా విన్న తరవాత అతడు నాకేసి గుచ్చి చూస్తూ:

"అంటే మీరిప్పుడు ఈ దేశ రాజ్యాధికారాన్ని వశపరచుకున్నవారికి శత్రువులన్న మాట?" అని ప్రశ్నించాడు.

"అవును," అన్నాను.

వృద్ధుడు తలవంచుకుని కొద్దిసేపు ఆలోచించి, "ఐతే, మీరీ అడవిప్రాంతాన్ని నివాసంగా ఏర్పరచుకుని, ఆ నరవాహన రాజు మీద వీలు దొరికినప్పుడల్లా దాడిచేయాలని చూస్తున్నారా?" అన్నాడు.

"అలాంటి ఆలోచన నా కెంతమాత్రం లేదు," అని తక్షణం జవాబిచ్చాను.

నా జవాబు కోయకుల వృద్ధుడికి చాలా సంతృప్తి కలిగించినట్టుంది. అతడు నాదగ్గరకు లేచివచ్చి, నా రెండు చేతులూ పట్టుకుని, "నేను, నా ప్రశ్నలతో తమకేమైనా కష్టం కలిగించివుంటే క్షమించండి. మీరు ఈ ద్వీపం వదలిపోదలిస్తే, అందుకు అవసరమైన సహాయం నేను చేయుగలను. నా కోర్కె ఒక్కటే: మీరు ప్రశాంతంగా







వున్న యీ అడవిప్రాంతాన్నీ, మా జీవితాలనూ ఒడుదుడుకులపాలు చేయవద్దని. మీరు యిక్కడినుంచి, ప్రస్తుత రాజ్యపాలకులమీద ఏమాత్రం తిరుగుబాటు లేవదీసినా అది, మా అటవీప్రాంతాన్ని అల్లకల్లోలం చేస్తుంది!" అన్నాడు.

ఆ రాత్రి నా అనుచరులందరినీ ఒక చోట చేర్చి ఉన్న పరిస్థితి వివరించాను. మేము ఈ అడవిప్రాంతాన దాగివున్నట్టు నరవాహనుడికి ఏమాత్రం తెలియనీయకుండా, వీలు చిక్కగానే ఈ ద్వీపాన్ని వదిలిపోవటం క్షేమమని అందరూ అంగీకరించారు. కాని, మేము తలచినదొకటైతే, ఆ రాత్రి సంఘటిల్లిన పరిణామం మరొకటి.

ఆరు బయట చెట్లకింద నేనూ, నా అనుచరులూ నిద్రకు ఉపక్రమించాం. మాకు కొంచెం ఎడంలో కొందరు కోయ యువకులు అడవి జంతువులు దగ్గరకు చేరకుండా ఉండేందుకు మంటలు వెలిగించి, వాటి చుట్టూ పడుకున్నారు. సరిగా అర్ధరాత్రి సమయంలో దూరంగా డప్పుల మోతలూ, ఒకచోట అడవి కాలుతున్న వెలుగూ కనిపించింది.

మాకు ఆశ్రయం యిచ్చిన కోయగూడెం అంతా తృటికాలంలో నిద్రమేల్కొన్నది. కుల పెద్దఅయిన వృద్ధుడు, యువకులందరినీ డాలూ, బల్లేలతో సర్వసన్నద్ధంచేసి, గూడెంచుట్టూ కాపలాపెట్టాడు. కొందరికి కాగడాలు యిచ్చి డప్పులమోత వినబడుతున్న ప్రాంతానికి పంపాడు.

"ఈ రణగొణ ధ్వని ఏమిటి?" అని నేను వృద్ధుణ్ణి అడిగాను.

అతడు నాలుక చప్పరిస్తూ, "ఏమయినా కావొచ్చు. ఏనుగుల మందల్లాంటివి గూడెంమీద పడి సర్వనాశనం చేస్తూండవచ్చు. లేక మరే ఆటవికజాతి వాళ్లయినా మాకున్న కొద్దిపాటి ఆస్తిపాస్తులు—పశువులూ వాటిని దోచుకునేందుకు దాడివచ్చి



వుండవచ్చు. కాని ఒకటి మాత్రం నాకు ఆశ్చర్యంగా వుంది!" అంటూ వృద్ధుడు కాలుతున్న అడవికేసి వేలు చూపెట్టాడు.

'ఇది మాకోసం నరవాహనుడి సైనికుల దాడి కాదుగదా?' అన్న సంశయం మెరుపులా నా హృదయంలో పరిగెత్తింది. అంతలో నలుగు రైదుగురు కోయయువకులు కేకలువేస్తూ, మేం వున్న చోటుకు వచ్చారు. వాళ్ళ కులపెద్దను చూస్తూనే, "మన గూడాలమీద సైనికులు పడి చేతికి అందినదల్లా సర్వనాశనం చేస్తున్నారు. వాళ్ళల్లో కొందరు అడవికి నిప్పు ముట్టిస్తున్నారు," అంటూ చెప్పారు.

"ఇలాంటిది లోగడ ఎన్నడూ జరగలేదే! ఇంతకూ వాళ్ళకు కావలసిందేమిటి?" అని ప్రశ్నించాడు కోయకుల పెద్ద.

అంతలో మేం వున్న చోటుకు ఒక నరవాహనపక్ష సైనికుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి ఇద్దరు కోయయువకులు తీసుకు వచ్చారు. "అయ్యా, వీణ్ణి అడగండి సంగతంతా చెపుతాడు. ఈ అడవిప్రాంతమంతా వీళ్ళ నాయకుడైన సుబాహుడిదంట!" అంటూ వాళ్ళు ఆ సైనికుణ్ణి వీపు మీద కర్రతో రెండు పోట్లు పొడిచారు.

కోయకుల పెద్ద నా వంక చూసి, తరవాత పెడరెక్కలు విరిచికట్టబడిన సైనికుణ్ణి ఇలా ప్రశ్నించాడు. "మా వాళ్ళు చెపుతున్నది నిజమేనా? సుబాహుడనే మీ నాయకుడికి, యీ అడవి ప్రాంతమంతా ఎవరు కట్టబెట్టారు?"

"నరవాహన మహారాజుగారు, మా నాయకుడు యుద్ధంలో చేసిన సహాయానికి ఈ ప్రాంతమంతా దానంచేశారు. ఇక్కడ నివసించే పశువులూ, పక్షులూ, మనుషులూ అంతా నేటినుంచి ఆయన అధీనం. మేం దీన్నంతా వశపరుచుకునేందుకే ఇక్కడకు పంపబడ్డాం!" అన్నాడు సైనికుడు.

(ఇంకా వుంది)



# మతిపోలిన తోడేలు

ఒక చాకలివద్ద ఒక గాడిద ఉండేది. దానికి మూటలు మొయ్యటం మొహం మొత్తి, స్వతంత్రంగా బతకాలనిపించింది. అందుచేత అది అడవికి పారిపోయింది. అక్కడ దానికి బోలెడంత తిండి, అడిగేవాడు లేడు.

అయితే అడవిలో ఉండే కష్టాలు అడవిలో ఉంటాయి. గాడిద నిశ్చింతగా మేస్తున్నసమయంలో ఒక తోడేలు అటుగా వచ్చింది. ఏదో ఉపాయంచేసి తప్పించుకోకపోతే ఆ తోడేలు తనను తప్పక చంపి తింటుందని తోచి, గాడిద వెనక కాలితో కుంటసాగింది.

"అసలే బుద్ధిలేని జంతువు, అందులోనూ కుంటుతున్నది, ఇది నన్ను తప్పించుకుని ఎక్కడికి పారిపోతుందిలే," అనుకున్నది తోడేలు. అది గాడిదను సమీపించి, "ఏం, మిత్రమా? కుంటుతున్నావేం?" అని అడిగింది.

"ఏముందీ? పరధ్యానంగా నడుస్తుంటే వెనక కాలిలో ఇంత లోతున ముల్లు దిగబడింది. నీవాలకంచూస్తే ఆకలిమీద ఉన్నట్టున్నావు. నన్ను తిన దలిస్తే ఆ ముల్లు లాగేసే మరీ తిను!" అన్నది గాడిద.

"ఏదీ, చూద్దాం!" అంటూ తోడేలు గాడిద వెనకవేపు వచ్చింది. అది తన కాలుఎత్తి పరీక్షిస్తూండగా, గాడిద తోడేలు మొహంమీద బలంకొద్దీ ఒక్క తన్ను తన్నింది. ఆ దెబ్బతో తోడేలు పళ్ళు కాస్తా ఊడిపడ్డాయి.

గాడిదకూడా బుద్ధితెచ్చుకున్నదై, ఈ అడివిలో దిక్కులేని చావు చచ్చే కన్న, చాకలివాడి మూటలు మొయ్యటమే నయమనుకుని ఇంటికి వెళ్లిపోయింది.



# ముగ్గురు శక్తిమంతులు

విక్రమార్కుడు మళ్ళీ చెట్టువద్దకు తిరిగి పోయి, దానిమీద వున్న శవాన్ని దించి, భుజంమీద వేసుకుని మౌనంగా శ్మశానం వేపు నడవసాగాడు. రాజు పట్టుదలను పరీక్షిస్తున్న బేతాళుడు, "రాజా, శక్తిసంపన్నుడవైన నిన్ను చూస్తుంటే నా కొక కథ జ్ఞాపకం వస్తున్నది. ఆ కథ నీకు చెబుతా శ్రద్ధగా విను," అంటూ ఈ క్రిందివిధంగా చెప్పసాగాడు.

పూర్వం దక్షిణదేశంలో ఒక కాపుపెద్దకు ఒక కుమారుడూ, ముగ్గురు కుమార్తెలూ ఉండేవారు. తండ్రి, కుమార్తెలు ముగ్గురికీ ముగ్గురు ధనికులను చూసి పెళ్ళిచేశాడు. కాపు కొడుకు ఇంకా పెళ్ళి చేసుకోలేదు.

తన చెల్లెళ్ళు కాపరాలకు వెళ్లిన ఒక ఏడాదికి కాపు కొడుకు వారిని చూడటానికి బయలుదేరి, మొట్టమొదట పెద్ద చెల్లెలు ఇంటికి వెళ్లాడు. "ఏమే, అమ్మాయి?

## బేతాళ కథలు

నువూ నీ భర్తా కులాసాగా వుంటున్నారా ?" అని అన్న చెల్లెలి నడిగాడు.

"ఏం కులాసాలే, అన్నయ్యా? మీ బావ మరిదికి బోలెడంత డబ్బున్నదిగాని చేసే టందుకు పనిలేదు. అయన గొప్ప విలు కాడు. నేను స్నానంచేసి బొట్టుపెట్టె ముందు పెట్టుకుని కూ చో గా నే అయన విల్లూ బాణమూ తీసుకుని నా బులాకీ కేసి కొడ తాడు. పొరపాటున గురితప్పి బాణం నాకు తగులు తుందేమోనని ఎప్పుడూ భయపడి చస్తున్నాను. ప్రాణాలు అరచేత పట్టుకుని బతుకుతున్నాననుకో" అని చెల్లెలు అన్నతో చెప్పు కున్నది.

"అదా సంగతి? నీ మొగుడికి నేను పని కల్పిస్తాలే! భయపడకు," అని చెప్పి కాపు కొడుకు రెండో చెల్లెలిని చూడబోయాడు.

"ఏమే, అమ్మాయి? నువ్వు నీ భర్తా కులాసాగా వుంటున్నారా?" అని అతని రెండో చెల్లెల్ని అడిగాడు.

"ఏం కులాసాలే, అన్నయ్యా? మీ బావ మరిదికి బోలెడంత డబ్బున్నదిగాని చేసే టందుకు పనిలేదు. ఆయనకు దివ్యదృష్టి వున్నది. మూడు లోకాలలో ఎక్కడ ఏం జరుగుతున్నా ఆయనకు కనిపిస్తుంది. అస్తమానం ఇంద్రలోకంలో జరిగే రంభా ఊర్వశీ మొదలైనవాళ్ళ నృత్యాలు చూసి ఆనం





దిస్తూ వుంటాడు. మన ప్రపంచంలో వుండనే వుండడు. ఏం చెయ్యాలో నాకు పాలుబోవటంలేదు," అని రెండో చెల్లెలు తన అన్నతో చెప్పుకున్నది.

"అదా సంగతి? నీ మొగుడికి నేను పని కల్పిస్తాలే! దిగులుపడకు!" అంటూ కాపు కొడుకు తన కడగొట్టు చెల్లెల్ని చూడబోయాడు.

"ఏమే, అమ్మాయి? నువూ నీ భర్తా కులాసాగా ఉంటున్నారా?" అని అతను తన ఆఖరు చెల్లెలి నడిగాడు.

"ఏం కులాసాలే, అన్నయ్యా? మీ బావ మరిదికి బోలెడంత డబ్బున్నదిగాని చేసేందుకు పనిలేదు. ఆయన వాయువేగ మనోవేగాలతో పరిగెత్తగలడు. పొద్దున్నే లేస్తూనే కాశీకి పరిగెత్తి విశ్వేశ్వరాలయంలో దీపారాధన చేస్తాడు. అక్కడినుంచి రామేశ్వరానికి పరిగెత్తి అక్కడ దీపారాధనచేస్తాడు. ఆ తరవాత తూర్పు సముద్రానికీ, పడమటి సముద్రానికీ వెళ్ళి, స్నానాలుచేసి రాత్రికి ఇల్లు చేరతాడు. యిటువంటి మనిషితో ఎట్లా కాపరం చెయ్యాలో నాకు తెలీకుండా వున్నది," అన్నది ఆఖరు చెల్లెలు.

"అదా సంగతి? నీ మొగుడికి నేను పని కల్పిస్తాలే! విచారించకు!" అంటూ కాపు కొడుకు ఇంటికి వెళ్లి, ఒకసారి వచ్చి పోవలిసిందని చెల్లెళ్ళకూ, బావమరుదులకూ కబురుచేశాడు. వారు కొద్దిరోజుల్లో కాపుకొడుకు యింటికి వచ్చారు.

కాపు కొడుకు బావమరుదులను కూచోబెట్టి, "మీరు ముగ్గురూ ఎంతో శక్తిమంతులై వుండికూడా మీ శక్తులను వృథా పోనిస్తున్నారు. ఇదేమీ బాగాలేదు. ఒక నెల రోజులు ప్రయాణించేసి మీరు చోళ దేశం వెళ్ళినట్టయితే మీ ముగ్గురికీ చక్కని పని కలుగుతుంది. మీ శక్తిసామర్థ్యాలు ప్రపంచానికంతకూ తెలుస్తాయి. కనుక మీరు వెళ్ళిరండి," అన్నాడు.



వారు ప్రయాణానికి ఒప్పుకుని బయలు దేరి కొంతకాలానికి చోళదేశం చేరారు. వారక్కడికి వెళ్ళుతూనే పేదరాసి పెద్దమ్మ ఇంట దిగి, పెద్దమ్మతో, "అవ్వా, ఈ ఊరి విశేషాలేమిటి?" అని అడిగారు.

పెద్దమ్మ నిట్టూర్చి, "విశేషాలేమున్నాయి, నాయన్లారా? మా రాజు కూతురు పెళ్ళి చేసుకోవడానికి పేచీపెడు తున్నది. వాడని దేవపారిజాతపు పుష్పాలు తెచ్చి ఇచ్చిన వాణ్ణి తప్ప మరెవరినీ ఆమె పెళ్ళాడదట. దేవపారిజాతాలు యెక్కడ వున్నాయని! ఎంత దూరాన ఉన్నాయని! వాటిని వాడే లోపుగా ఎవరు తెస్తారని! మా రాజుగారు దిగులుతో మంచంపట్టారు," అన్నది.

శక్తిమంతులు ముగ్గురూ కూడబలుక్కుని రాజుగారి దగ్గిరికి వెళ్లి, "మహారాజా! మీ కుమార్తె వాడని దేవపారిజాత పుష్పాలు తెచ్చినవాణ్ణి పెళ్ళాడతానన్నదట. వాటిని మేము తెస్తాము!" అన్నారు.

"అంతకంటె కావలిసిందేమిటి? అలాగే తీసుకురండి!" అన్నాడు రాజు.

వారు ముగ్గురూ కలిసి ఊరి పొలిమేర చేరుకున్నారు. దివ్యదృష్టి కలవాడు చూట్టూ కలయచూసి, ఒకవేపుగా వేలుచూపి, "ఈ దిక్కున రెండువేల యోజనాల దూరాన ఒక అడవి అవతల దేవపారిజాత వృక్షాల తోట ఉన్నది," అన్నాడు.

వెంటనే మనోవేగుడు ఆ దిక్కుగా బయలు దేరాడు. వాడు కనబడకుండా పోయినాకకూడా దివ్యదృష్టి కలవాడు వాణ్ణి చూస్తూ, "మనవాడు అరణ్యాన్ని చేరు కున్నాడు! పారిజాతపు తోట ప్రవేశించాడు! పూలు కోస్తున్నాడు, మూట గట్టుతున్నాడు! తిరుగు ప్రయాణమైనాడు! అరణ్యంలో విశ్రాంతికోసం ఒక చెట్టుకింద నడుము వాల్చాడు! అమ్మయ్యో, పులి! పక్కనే వున్న పొదలోనుంచి మనవాణ్ణి చూస్తున్నది!" అని వాపోసాగాడు.

"ఎటుగా వున్నదా పులి! వేలితో చూపు! తక్షణం దాన్ని హతమారుస్తాను!" అన్నాడు గురికలవాడు.

దివ్యదృష్టి గలవాడు పులి వున్న దిక్కుగా వేలుపెట్టి చూపాడు. మరుక్షణం గురికల వాడు బాణం ఎక్కుపెట్టి వదిలాడు.

"అః! దెబ్బకు పులి చచ్చింది! దాని అరుపుకు మనవాడు లేచాడు! బయలుదేరి వచ్చేస్తున్నాడు! ఇక భయంలేదు!" అన్నాడు దివ్యదృష్టి కలవాడు.

మరి కొంచెంసేపటికి మనోవేగుడు దేవ పారిజాత పుష్పాలతో తిరిగిరానే వచ్చాడు. ముగ్గురూ కలిసి రాజుగారివద్దకు పూలు పట్టుకుపోయి, "మహారాజా, వాడని దేవ పారిజాత పుష్పాలు తెచ్చాం!" అన్నారు.

రాజు నిర్ఘాంతపోయి, "వీటిని మీలో ఎవరు తెచ్చారు?" అని అడిగాడు.

"కనిపించటం లేదా? మేము ముగ్గు రమూ తెచ్చాం!" అన్నారు వారు.

రాజు అయోమయంలో పడిపోయాడు. తన కూతురిని ఆ ముగ్గురిలో ఎవరికిచ్చి చెయ్యాలో రాజుకు తోచలేదు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఆ ముగ్గురిలో రాజకుమార్తెను చేసుకోవటానికి ఎవరు అర్హుడో చెప్పు. తెలిసికూడా సమా ధానం చెప్పకపోయావో, తల పగిలిపో తుంది!" అన్నాడు.

"రాజకుమార్తెను పెళ్ళాడటానికి ముగ్గురూ అర్హులు కారు. వారు శక్తి సంపన్నులే అయినప్పటికీ, తమ శక్తులను సద్వినియోగం చేసుకునే నేర్పు వారిలో ఒక్కరికీ లేదు. ఆ నేర్పు కనబరిచినవాడు వారి బావమరిది. అతనే రాజకుమార్తెను పెళ్ళాడటానికి అన్ని విధాలా అర్హుడు!" అన్నాడు విక్రమార్కుడు.

ఈ విధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు.



# హీనప్రాణుల ఘనత

జలప్రళయానికి పూర్వం సర్వజంతుమహాసభ ఒకటి జరిగింది. దానికి సింహం అధ్యక్షతవహించింది. సభకు ప్రపంచంలోగల గొప్ప జంతువులూ, కొద్ది జంతువులూ, అన్నీ హాజరయాయి. జంతువుల రాజకీయాలలో చాలా సమస్యలుండటంచేత వాగ్వాదాలు తీవ్రంగా చెలరేగాయి. ఈ వాగ్వాదంలో పెద్ద జంతువులూ, నోరుగల జంతువులూ చేరి హీనప్రాణుల గొంతు వినిపించకుండా చేయటానికి శాయశక్తులా ప్రయత్నించాయి.

ఇంతలో ఒక చిన్న అపచారం జరిగింది. అడావుడిలో ఏనుగు ఒక ఎండ్రకాయమీద కాలుపెట్టింది. ఎండ్రకాయ రూపులేకుండా పోయింది. మిగిలిన ఎండ్రకాయలు తమ ఆక్షేపణ తెలిపాయి. ఇతర అల్పప్రాణులు ఈ ఆక్షేపణను బలపరిచాయి. అయితే పెద్దజంతువులు, ఒక్క ఎండ్రకాయకోసం యింత రాద్ధాంతం ఏమిటని, ఆక్షేపణను తృణీకరించాయి.

ఎండ్రకాయలకు కోపంవచ్చింది. అవి సమావేశాన్ని బహిష్కరిస్తూ నేలలో దూరి సొరంగాలు చేసుకుంటూ సముద్రంకేసి వెళ్ళిపోయాయి. ఎండ్రకాయలు వేనకు వేలుండటంచేత ఈ సొరంగాలతో నేలయావత్తూ డొల్ల అయిపోయింది. వాటిలోనుంచి సముద్రజలం పైకివచ్చేసి నేలనూ, పర్వతాలనూ, సమస్త ప్రాణులనూ ముంచేసింది. అదే ప్రళయం.





# నేర విచారణ

కాంచీపురమనే నగరాన్ని చంద్రగుప్తుడనే మహారాజు పరిపాలిస్తూండేవాడు. ఆయ నకు ఇద్దరు కుమారులు, కవలపిల్లలు కలిగారు. వారి కాయన కుశ లవులని పేరు పెట్టుకున్నాడు.

కుశలవులు చిన్నతనంనుంచీ చక్కగా చదువుకుని పదహారేళ్ళకే మంచి ప్రజ్ఞా వంతులైనారు. అయితే ఇద్దరి మనస్తత్వాలూ ఒకటికాదు. కుశుడు రాజసం హెచ్చుగా గలవాడు, లవుడు సాత్విక స్వభావమూ, విరక్తీ గలవాడు. అందుచేత చంద్రగుప్తుడికి కుశుడే రాజ్యార్హుడనీ, లవుడు పనికిమాలిన వాడనీ ఒక నమ్మకం ఉండేది.

ఒకసారి కుశలవులకు ఏదో వాగ్వాదం జరిగింది. ఇద్దరూ తీర్పుకోసం తండ్రివద్దకు వెళ్ళారు. కుశుడిపై పక్షపాతంగల రాజు లవుడిది తప్పని తేల్చటమేగాక అతన్ని గట్టిగా అవమానించాడు. ఆ అవమానం పొంది లవుడు ఎవరికీ చెప్పకుండా కట్టు బట్టలతో దేశాలమీద వెళ్ళిపోయాడు.

ఇల్లు వదిలినదిమొదలు లవుడి వైరాగ్యం మరింత హెచ్చింది. అతను తన పేరు అల్పుడని మార్చుకుని ఒక దేశంనుంచి మరొక దేశానికి సంచారం చెయ్యసాగాడు.

ఒకరోజు అల్పుడు ఒక అగ్రహారం మీదుగా వెళుతూండగా ఒక ఇంటి అరుగు మీద ఒక బ్రాహ్మడు కూచుని భారతంలో శాంతిపర్వం చదువుతున్నాడు. ఊరివారు కొందరు కూచుని వింటున్నారు. ఆ బ్రాహ్మడు చదివే ధర్మాలు చెవిని పడేసరికి అల్పుడికి మరి కొంత వినాలని పించింది. అందుచేత అతనుకూడా అరుగు చివర కూర్చుని పురాణం వినసాగాడు.

ఆ పురాణం చదివే ఆయన పేరు అగ్నివర్మ. ఆయనకు సురస అనే ఒక చక్కని కూతురున్నది. ఆమెకు అగ్నివర్మ వివాహం

కె. రామారావు

చేతామనుకున్నాడు. అయితే సురస తాను బ్రహ్మచారిణిగానే ఉంటానని పట్టుపట్టింది. ఎంతమంది యెన్నివిధాల చెప్పినా ఆమె మనసు మారలేదు.

పురాణం ముగియగానే అల్పుడు అగ్ని వర్మకు నమస్కారంచేసి, "అయ్యా, తమరు చదివిన దానివల్ల నా సందేహం ఒకటి తీరింది. అదివరలో నేను సన్యాసం ఒకటే మోక్షమార్గ మనుకునేవాణ్ణి. సంసారం సన్యాసానికి ఏమాత్రమూ తీసి పోదని ఇప్పుడు తెలుసుకున్నాను. తమ కెంతో కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

అల్పుడు మురికి బట్టలతో, మట్టికొట్టు కుని ఉన్నప్పటికీ, పరికించిచూస్తే గొప్ప అందగాడుగా, వర్చస్విగా ఉండటం చూసి అగ్నివర్మ, "బాబూ, నీ పేరేమిటి? నీ తల్లిదండ్రు లెవరు? ఎక్కడినించి వస్తు న్నావు? మీదే కులం?" అని అడిగాడు.

"నాపేరు అల్పుడు. మిగిలిన విషయా లేవీ నేనెరగను. నాకు ధర్మంగురించి చాలా ఆసక్తి!" అన్నాడు అల్పుడు.

"నీ కెవ్వరూ లేనిపక్షంలో మా ఇంటనే వుండి, రోజూ పురాణం విను, నాయనా!" అన్నాడు అగ్నివర్మ. అల్పుడు సంతో షంతో అంగీకరించాడు.



ఎన్నడూ ఏ పురుషుడిపైనా కోరిక కల గని అగ్నివర్మ కూతురు సురసకు, అల్పుణ్ణి చూడగానే దుర్బుద్ధి కలిగింది. ఒకనా డతను ఊరిబయటికి బయలుదేరుతూం డటం చూసి, నీళ్ళు తెచ్చే వంకపెట్టి ఆమె కూడా బిందెతీసుకుని అతని వెనకే ఊర బావికి బయలుదేరింది.

మిట్టమధ్యాహ్నం వేళ ఊరిబయట ఎవరూ లేకపోవటం గమనించి సురస, అల్పుడికి తన కోరిక తెలిపింది.

"నువు గురు పుత్రికవు, నా చెల్లెలులాటి దానివి. నన్ను నువుకోరటం మహాపాతకం!" అన్నాడు అల్పుడు. సురస యెన్నోవిధాల

చెప్పిచూసిందిగాని లాభం లేకపోయింది. ఆమె తన గాజులు పగలగొట్టుకుని, చేతు లంతా బరుక్కుని, జుట్టు విరబోసుకుని, గొల్లున ఏడుస్తూ ఇటింకి తిరిగి వెళ్ళి, తండ్రితో అల్పుడు తనను బలాత్కరించ బోయాడని చెప్పింది.

పురుషద్వేషిణి అయిన తన కూతురు అబద్ధం చెప్పివుండదనీ, ఇలాటి దురుద్దేశం తోనే అల్పుడు తన యింట చేరివుంటాడనీ నమ్మి, అగ్నివర్మ అల్పుడిమీద గ్రామాధి కారివద్ద ఫిర్యాదుచేశాడు.

గ్రామాధికారి అగ్నివర్మనూ, సురసనూ, అల్పుణ్ణి పిలిపించి వారిని ప్రశ్నించాడు. సురస చెప్పినదీ, తండ్రి చెప్పినదీ ఒకటి గానే వున్నది. అల్పుడు తనకై తాను ఏమీ చెప్పలేదు. "నువు దోషివేనా?" అని అడి గితే, ఔనన్నాడు. "నిన్ను దండించ వచ్చునా?" అంటే, దండించవచ్చు నన్నాడు. "అలాటి పని ఎందుకు చేశావు?" అని అడిగితే, "బాబూ, కామం అన్ని మహా పాతకాలకూ దారితీస్తుంది," అన్నాడు.

చట్టప్రకారం అల్పుడికి విధించవలసిన శిక్ష కాళ్ళూ, చేతులూ ఖండించటం. కాని అల్పుడు నిర్దోషి అయివుండవచ్చునని గ్రామాధికారి అంతరాత్మలో అనుమానం చేరి కూచున్నది. సురస తప్ప ఈ ఆరో





పణుకు వేరే సాక్షులులేరు. ఆమె సాక్ష్యాన్ని సంశయించటానికీ లేదు. ఎందుకంటే పురుషులంటే ఆమెకు ఎటువంటి విముఖత్వమో గ్రామంలో అందరికీ తెలుసు, గ్రామాధికారికీ తెలుసు.

గ్రామాధికారి ఎటూ తేల్చుకోలేక ఈ ఫిర్యాదు తాలూకు సాక్ష్యమంతా ఆ దేశం ఏలే సామంతరాజు, దేవవర్మ వద్దకు భటునిద్వారా పంపాడు.

ఈ ఫిర్యాదుకు సంబంధించిన సాక్ష్యమంతా మొదట తిరగవేసినప్పుడు దేవవర్మకు గ్రామాధికారి మీద కోపంవచ్చింది. అల్లుడు నేరం ఒప్పుకున్నాడు. సురస పవిత్రతగురించి ఎటువంటి శంకా లేదు. అలాటప్పుడు గ్రామాధికారి అల్లుడికి ఎందుకు శిక్ష విధించగూడదూ?

దేవవర్మకు యమున అనే కుమార్తె ఉన్నది. ఆమె చాలా వివేకవతి. రాజు తనకేమైనా సందేహం కలిగినప్పుడు యమునతో సంప్రతిస్తూండేవాడు. అగ్నివర్మ చేసిన ఫిర్యాదుగురించి ఆయన యమునతో చెప్పాడు. ఆమెకూడా సాక్ష్యమంతా చూసింది. అగ్నివర్మనూ, సురసనూ, అల్లుణ్ణీ పిలిపించి విచారణ చేస్తేగాని గ్రామాధికారి తటపటాయించటానికి కారణం తెలియదని ఆమె అన్నది.





రాజు అశ్చర్యంతో, "జరిగిపోయిన దానికి ఇప్పుడు సాక్ష్యం ఎలా సృష్టి అవుతుంది?" అని అడిగాడు.

"అది నాకు వదిలిపెట్టు, నాన్నా! తీర్పు చెప్పటానికి వారంరోజులు గడువు పెట్టుకో. మిగిలిన ఏర్పాట్లు నేను చూస్తాను" అన్నది యమున నవ్వుతూ.

అగ్నివర్మ బస రాజపురోహితుడి ఇంటనూ, సురస బస అంతఃపురం గదిలోనూ యమున ఏర్పాటుచేసింది. వెంటనే ఆమె తండ్రివద్దకు వెళ్లి, "ఈ ఫిర్యాదులో నీవూ, నేనూ సాక్షులం. సాక్ష్యానికి పోదాం పద," అంటూ తండ్రిని ఒక గదిలోకి తీసుకుపోయింది.

రాజు ఆ గది తలుపు సందునుంచి చూస్తే, అవతలి గదిలో విచారంగా కూచుని వున్న అల్లుడు కనిపించాడు.

ఈలోపల సురస తన బస అంతా పరీక్షించింది. ఆ గది చాలా అందంగా అలంకరించబడివుంది. ఎక్కడ చూసినా అద్దాలూ, దీపాలూ, హంసతూలికా తల్పాలూ, అగరు ధూపాలూ ఉన్నాయి. కాని ఎంతసేపు చూసినా ఎవరూ రారు. సురసకు యేమీ తోచక గది అంతా పచారుచేస్తూ ఒక వాకిలి వద్దకు వచ్చి తలుపు తోసింది. తలుపు

ముగ్గురూ అస్థానానికి పిలిపించబడ్డారు. రాజు ముగ్గుర్నీ ప్రశ్నించాడు. వారు గ్రామాధికారితో చెప్పిన మాటలే చెప్పారు. కాని అల్లుడు నిర్దోషి అన్న సందేహం రాజుకూ పట్టుకున్నది. సాక్ష్యం నమ్మి అల్లుణ్ణి శిక్షించటానికి దేవవర్మ అంతరాత్మ అంగీకరించలేదు.

అట్లని అల్లుడు నిర్దోషి అని వదిలిపెట్టటానికి కొంచెమైనా ఆధారంలేదు. అయన మళ్ళీ కుమార్తె సలహా కోరాడు.

"ఈ ఫిర్యాదుకు ప్రత్యక్ష సాక్ష్యం సృష్టిస్తేనేగాని న్యాయం జరగదు. అందుకు ప్రయత్నించాలి," అన్నది యమున.

గడియ వేసివుండనందున తెరుచుకున్నది. అవతలి గదిలో ఏమున్నదో చూద్దామని సురస లోపలికి అడుగు పెట్టేసరికి, ఒక కుర్చీలో తలవంచుకుని కూచునివున్న అల్పుడు కనిపించాడు.

సురస వెంటనే అటూ ఇటూ చూసి, ఎవరూ లేరని రూఢిచేసుకుని, అల్పుడి దగ్గిరికి పరిగెత్తుకు వచ్చింది. అల్పుడు తల ఎత్తి ఆమెను చూసి మళ్లీ తల దించేశాడు.

"ఈసారి శిక్ష తప్పదు. నేనంటే నీ కెందు కింత విముఖత్వం? ఇంత అంద గాడివి, ఎందుకు వృథాగా కాళ్ళు చేతులు తెగకొట్టించుకుంటావు? గ్రామాధికారిదగ్గిర తప్పు చేసినట్టు ఒప్పుకున్నావే? అంటే నామీద నీకు ప్రేమ వున్నదన్నమాటేగా? నా ప్రేమ ఆమోదించు. వెంటనే నేచేసిన ఫిర్యాదు ఉపసంహరించు కుంటాను," అన్నది సురస అల్పుడితో.

అంతా విని అల్పుడు, తల ఎత్తకుండానే "వెళ్ళు. నాకు నీతో మాట్లాడే అవసరం లేదు," అన్నాడు.

ఈ జరిగినదంతా దేవవర్మా, యమునా ప్రత్యక్షంగా చూశారు. మర్నాడు దేవవర్మ సభలో తీర్పుచెప్పాడు. సురస నీచురాలు, అల్పుడు నిర్దోషి!



"ఈ సురస పరపురుషుణ్ణి కోరటమే గాక, అతను నిరాకరించగా అతనిపై అసత్యమైన ఆరోపణచేసి అతన్ని శిక్షించాలని యత్నించింది. అయినప్పటికీ ఆమెను దండించకుండా విడిచిపెడుతున్నాం," అన్నాడు దేవవర్మ.

ఆ తరవాత రాజు అల్పుణ్ణి తన అతిథిగా ఉంచుకుని తన కుమార్తె యముననిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. అల్పుడు మొదట ఆమోదించలేదు, కాని తాను నిర్దోషి అని సాక్ష్యంతోసహా రుజువుచేసినది యమునే అని తెలిసినాక పెళ్ళికి ఒప్పుకున్నాడు. ఇద్దరికీ వైభవంగా పెళ్లి అయింది.

ఈ సంగతి తెలియగానే సురస తన తండ్రిని రెచ్చగొట్టి, "ఈ దేవవర్మ అల్లుణ్ణి తన అల్లుడు చేసుకోగోరి మన ఫిర్యాదు కొట్టివేశాడు. నాకు న్యాయం జరగకపోవటం చేత నేను చెడ్డదాన్నని అందరూ ఆడిపోసుకుంటున్నారు. అందుచేత ఈ సామంతు మీద మనం చంద్రగుప్త మహారాజువద్ద ఫిర్యాదుచేద్దాం," అన్నది.

తన కుమార్తె పరమ పవిత్రురాలని అగ్నివర్మ నమ్మం. ఆయన మహారాజువద్ద ఫిర్యాదు చేశాడు.

చంద్రగుప్త మహారాజు దేవవర్మనూ, అల్లుణ్ణీ తన ఆస్థానానికి పిలిపించాడు. అల్లుణ్ణి చూస్తూనే ఆయన అతను తన కుమారుడు లవుడేనని గుర్తించి ఆనంద బాష్పాలు రాల్చాడు. ఏమంటే, లవుడు వెళ్లిపోయిన తరవాత కుశుడు చాలా దుర్మార్గాలు చేయసాగాడు. అతను రాజ్యార్హుడు కాడనీ, గుణశీలాలు గలిగి రాజ్యార్హుడైన లవుడు వెళ్లిపోయాడనీ చంద్రగుప్తుడికి తీరని విచారం పట్టుకున్నది.

తన కుమారుడు దొరికాడన్న ఆనందంతో బాటు, అతన్ని విచారించవలసి వచ్చినందుకు చంద్రగుప్తుడికి విచారంకూడా కలిగింది. ఆ విచారణలో యమున సాక్ష్యం చెప్పి, లవుడు నిరపరాధి అని రుజువుచేయటానికి తాను పన్నిన పన్నాగం వివరించి చెప్పింది. ముద్దాయి తన కొడుకే అయినప్పటికీ చంద్రగుప్త మహారాజు విచారణ యథావిధిగా జరిపి, సభికుల ఆమోదంతో లవుడు నిర్దోషి అని తీర్పుచెప్పాడు.

ఈ సంగతి వినగానే సురస తండ్రి అగ్నివర్మకు తన కూతురును గురించి నిజం తెలిసింది. అతడికి వైరాగ్యం కలిగి ఇంటికి పోకుండా నేరుగా అడవికి వెళ్ళిపోయాడు.

తరవాత లవుడు కాంచీపుర రాజ్యానికి పట్టాభిషిక్తుడై యమునతోబాటు కలకాలం సుఖంగా గడిపాడు.





# నిజమైన లక్ష్మి

పూర్వం ఉజ్జయినీ నగరాన్ని ధీమంతుడనే రాజు పాలించాడు. ఆయనకు మహారాజులకు ఉండదగిన అష్టఐశ్వర్యాలూ ఉండేవి.

ఇలా ఉండగా ఒకనాడు ధీమంతుడి వద్దకు ఒక జోగి వచ్చాడు. జోగిని చూసి రాజు, "ఏం కావాలి ?" అని అడిగాడు.

"మహారాజా, నాదగ్గిర ఒక ఇనపలోటా, ఒక కర్రా ఉన్నాయి. వాటిని తమకు అమ్మి డబ్బు తీసుకు పోదామనివచ్చాను," అన్నాడు జోగి.

"ఎంత కమ్ముతావు ?" అన్నాడు రాజు.

"అవి తీసుకుని ఒక లక్షరూపాయ లివ్వండి !" అన్నాడు జోగి.

రాజు వెనకా ముందూ ఆలోచించకుండా, మంత్రులు మొదలైనవారు వద్దంటున్నా వినకుండా, జోగికి లక్ష రూపాయలూ ఇచ్చి ఆ రెండు వస్తువులూ తీసుకున్నాడు.

ఆ రాత్రి ధీమంతుడు పడుకోగానే ఒక కల వచ్చింది. ఒక స్త్రీ, సమస్తాభరణాలూ ధరించి, రాజసౌధంలో నుంచి బయటికి పోతూండటం రాజు చూశాడు.

"ఎవరు నీవు ?" అని అయన ఆ స్త్రీని అడిగాడు.

"నేను ధనలక్ష్మిని !" అన్నదా స్త్రీ.

"ఎందుకు వెళ్లిపోతున్నావు ?" అన్నాడు రాజు.

"లక్ష రూపాయ లిచ్చి ఒక జోగి దగ్గిర ఎందుకూ పనికిరాని లోటా, కర్రాకొని, నన్ను అవమానించావు. నీ ఇంట ఒక్క క్షణం కూడా ఉండను," అన్నది ధనలక్ష్మి.

"అవశ్యం వెళ్లు !" అన్నాడు రాజు నిర్లక్ష్యంగా.

రెండో జామున రాజుకు కలలో ఇంకొక స్త్రీ కనిపించింది. ఆమె ఒడ్డూ, పొడుగూ ఉండి మంచి యౌవనంలో ఉన్నది.

అర్. శకుంతల

"ఎవరు నీవు?" అన్నాడు రాజు.

"నేను బలలక్ష్మిని!" అన్నదామె.

"ఏం, పోతున్నావు?" అన్నాడు రాజు.

"నిన్ను, ధనలక్ష్మి వదిలింది, ఇక నన్నెంత కాలం దక్కించుకో గలవు? నేనూ వెళ్లి పోతున్నాను, ఒక్కక్షణం ఉండను!" అన్నది బలలక్ష్మి.

"వెళ్లు!" అన్నాడు రాజు నిశ్చింతగా.

మళ్లీ మూడవ జామున రాజుకు కలలో ఒక వృద్ధురాలు కనిపించింది. ఆమెకూడా రాజ సౌధం వదలి వెళ్లి పోతున్నది. ఆమె తల నెరిసి ఉన్నది. కాని ఆమె ముఖం కళకళ లాడు తున్నది.

"ఎవరు నీవు?" అన్నాడు రాజు.

"నేను జ్ఞాన లక్ష్మిని", అన్న దామె.

"ఏం, పోతున్నావు?" అన్నాడు రాజు.

"బలలక్ష్మి పోయాక నా కిక్కడ ఏం చోటున్నది? నేనూ వెళ్లి పోతున్నాను," అన్నది జ్ఞాన లక్ష్మి.

"అవశ్యం వెళ్లు!" అన్నాడు రాజు నిబ్బరంగా.

తరవాత నాలుగో జామున రాజుకు కలలో ఒక దేవతా స్త్రీ లాటిది, రాజ సౌధం వదిలి వెళ్లి పోతూ కనిపించింది.

"నీ వెవరు?" అని అడిగాడు రాజు.

"నేను ధైర్య లక్ష్మిని!" అన్నదామె.

రాజు ఆమెదారికి అడ్డునిలిచి, "నువ్వెందుకు వెళ్లి పోతున్నావు?" అన్నాడు.

"అందరూ నిన్ను వదిలి పోతున్నారు, నేను మాత్రం ఇంక నీ వద్ద ఎందుకు ఉండటం?" అన్నది ధైర్య లక్ష్మి.

రాజు చప్పున ఆమె చెయ్యి పట్టుకుని, "నువు వెళ్లటానికి వీలులేదు. వాళ్లు పోయినా నాకు లక్ష్యం లేదు. నువు ఉంటే నాకు చాలు!" అన్నాడు.

ధైర్య లక్ష్మి నవ్వి, "సరే అయితే నేను నీ దగ్గిరే ఉండి పోతాను?" అన్నది. రాజు సంతోషంతో నిద్రలేచాడు.





# తల్లీ కూతుళ్లు

## 3

ఖాలిద్ దిలైలాను దొంగతనాల విషయం ప్రశ్నించగా, "మీరడిగేది నాకర్థం కావటం లేదు. నేను నా జన్మలో దొంగతనమన్నది చేసి ఎరగను," అన్నది దిలైలా.

అప్పటికే పొద్దుగూకింది. ఆ రోజుకు ఆమెను విచారించే వ్యవధిలేదు. ఆమె చేసిన దుండగాలు చాలా ఉన్నాయి. విచారించవలసిన సాక్షులు చాలామంది ఉన్నారు. ఆమె ఒకంతట తన నేరం ఒప్పుకునేటట్టులేదు. అందుకని ఆ రాత్రి ఆమెను ఖైదులో చీకటికొట్లో వేసిఉంచి నట్లయితే తెల్లవారి విచారణ జరుపుదామను కున్నాడు ఖాలిద్. కాని జైలు అధికారి ఆమెను గురించి బాధ్యత వహించటానికి ఒప్పుకోలేదు. "ఇంత దొంగది ఏదో ఉపాయంచేసి ఖైదునుంచి తప్పుకుంటే నా పీకపోతుంది," అన్నాడాయన.

"అదీ నిజమే. విచారణ జరిపేదాకా, ఈ ముసలిదాన్ని నలుగురికీ కనిపించే చోటనే ఉంచి కాపలాకాయటం మంచిది," అన్నాడు ఖాలిద్. ఆయన గుర్రం ఎక్కి బయలుదేరాడు. అయిదుగురు ఫిర్యాదీలూ దిలైలాను ఈడ్చుకుంటూ ఆయన వెనకగా నగరం వెలపలకు వెళ్ళారు. అక్కడ బయలుప్రదేశంలో ఆమె నొక స్తంభానికి కట్టేయించి, అయిదుగురినీ ఆమెకు కాపలా పెట్టి ఖాలిద్ నగరంలోకి వెళ్లిపోయాడు.

అయిదుగురూ ఆమెచుట్టూ కూచుని చాలాసేపు తిట్లతో కసితీర్చుకున్నారు. కాని భోజనాలు చెయ్యగానే అందరికీ నిద్ర ముంచుకొచ్చింది, ఎందుకంటే వారికి మూడు రాత్రులుగా నిద్ర అన్నది లేదు.

అర్ధరాత్రి దాటిన చాలాసేపటికి ఆ ప్రాంతానికి ఇద్దరు వచ్చి కలుసుకున్నారు.

ఎస్. వెంకటసుబ్బయ్య

ఒకడు నగరం వదిలి పోతున్నాడు, రెండో వాడు నగరానికి చేరుతున్నాడు. ఇద్దరూ ఆగి మాట్లాడుకోసాగారు. వారు మాట్లాడు కునే మాటలన్నీ దూరాన ఉన్న దిలైలాకు వినిపిస్తూనే ఉన్నాయి.

"బగ్దాదులో అన్నిటినీ మించి అనుభ వించదగిన వేమిటి?" అని వచ్చేవాడు వెళ్లే వాణ్ణి అడిగాడు.

"మీగడపూసిన తేనెరొట్టెలు! నేనీ నగ రంలో ఉన్న మూడురోజులూ అవేతిన్నాను. ఏదైనా తనివితీరుతుందిగాని, అవిమాత్రం ఎంతతిన్నా తనివితీరవు, ఇంకా తినాలని పిస్తుంది," అన్నాడు వెళ్ళేవాడు.

"భేష్! ఎంత ఖర్చయినా సరే నేను ఈ నగరంలో ఉన్నన్నాళ్ళూ మీగడపూసిన తేనెరొట్టెలే తింటాను," అన్నాడు వచ్చే వాడు. వెళ్ళేవాడు వెళ్ళిపోయాడు. వచ్చే వాడు దిలైలా కట్టేసిఉన్న దిక్కుగా వచ్చాడు.

ఈ సంభాషణ అంతా వింటున్న దిలైలా అప్పటికప్పుడే ఒక యుక్తి ఆలోచించింది. ఆ యుక్తి పారితే తాను తప్పించుకు పారి పోవచ్చు. ఈ వచ్చేవాడు పరదేశి. వాడికి తానెవరో, తన కథ ఏమిటో తెలియదు. అందుచేత వాడు సులువుగా మోసపోవచ్చు. ఇలా ఆలోచించి, దిలైలా, "నాకువద్దు! నేను తినను!" అనటం ఆరంభించింది.



అతను దగ్గరకువచ్చి "ఏమిటమ్మా? ఎవరు నువు? ఎందుకిక్కడ నిన్ను కట్టిఉంచారు? ఏమిటి వద్దంటున్నావు?" అని అడిగాడు.

"ఏం చెప్పేది, నాయనా? నా భర్త తేనె రొట్టెలు తయారుచేసి వాటిమీద మీగడ పూసి అమ్మి, లక్షలు గడించాడు. మొదట్లో నాకవి ఇష్టమేగాని రానురాను మొహం మొత్తి పోయింది. మొన్న ఒకనాడు మా దుకాణానికి ఎవరో గొప్పవారు వస్తే నాభర్త నన్నుకూడా వారితోబాటు తేనెరొట్టెలు తినమని నిర్బంధించాడు. నేను వాటిని నోట పెట్టేసరికి వాంతి కలిగినంతపని అయింది. వచ్చినవారికి అనుమానంతగిలి వాటిని తినకుండానే వెళ్లిపోయారు. నా భర్తకు డబ్బులు రాకపోవటమేగాక చేసిన సరుకంతా వృథా అయిపోయింది. ఆ మాట నిజమే, కాని నా తప్పుమాత్రం ఏమిటి? నన్ను తేనెరొట్టెలు తినమనటం నా భర్త తప్పు. అయినా, తన వ్యాపారాన్ని పాడు చేశానని నా భర్త నామీద ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి నాకు తేనె రొట్టెలు తినే శిక్ష విధించి ఇక్కడ నిర్బంధంలో ఉంచాడు. తెల్లవారుతూనే రాజభటులు తేనెరొట్టెలు తెస్తారు. అవి అందరూ చూస్తుండగా తిన్నదాకా నాకు భోజనం పెట్టరు. మూడు పూటలనుంచీ





మాడుతున్నాను. నా కష్టం ఏమని అడుగుతావు, నాయనా?" అన్నది దిలైలా.

"అయ్యో, అవ్వా! పాపం, నీ కెంత కష్టమొచ్చింది! ఆ కష్టం నాకైనా రాక పోయెనే?" అన్నాడు కొత్తవాడు.

"అదేం భాగ్యం, నాయనా? నా కట్టు విడిపించితివా. నా స్థానంలో నిన్ను కట్టేస్తాను. నాలాగే నువు కూడా ముఖాన ముసుకువేసుకో. నేనే అనుకుని నీకు తేనె రొట్టెలు, మీగడతో సహా మేపుతారు!" అన్నది దిలైలా.

ఈ మాటలకు మోసపోయి కొత్తవాడు ఆమె కట్లు విప్పాడు. అతన్ని స్తంభానికి కట్టి, ముఖాన ముసుగువేసి దిలైలా, అక్కడ వున్నగుర్రం ఎక్కి బగ్దాదుకు వెళ్ళిపోయింది.

తెల్లవారగానే ఫిర్యాదీలు అయిదుగురూ లేచి, స్తంభానికి కట్టిఉన్నది దిలైలాయే ననుకుని మళ్ళా తిట్లు సాగించారు. కాని స్తంభానికి కట్టిఉన్నవాడు, "ఎంతకూ తేనె రొట్టెలు రావేం?" అని అడిగాడు. వారతని ముఖాన ఉన్న ముసుగు తొలగించి చూసి, ముసలిది మళ్ళీ తమ కళ్ళలో కారంకొట్టిందని తెలుసుకున్నారు.

కొద్దిసేపట్లో ఖాలిద్ స్వయంగా వచ్చాడు. జరిగినదంతా విన్నాడు. ఇది తనవల్ల అయే పనికాదనుకున్నాడు. అందరినీ వెంట పెట్టుకుని ఆయన నేరుగా ఖలీఫా వద్దకే బయలు దేరాడు.

ఖలీఫా హారూన్ అల్‌రషీద్ అందరి కథలూ విని, ఎవరెవరి కేమేమి నష్టం జరిగిందో అదంతా తాను సరిచేస్తానని మాట ఇచ్చాడు. కాని ముందుగా ముసలి దాన్ని పట్టవలసి ఉంది.

ఆ ముసలిదాన్ని పట్టవలసిన భారాన్ని ఆయన ఖాలిద్‌పైనా, ముస్తఫాపైనా వేశాడు.

ఖాలిద్ ఆపని తనవల్ల ఎంతమాత్రం కాదన్నాడు. అయితే అందుకు మరెవరి నన్నా చూపమన్నాడు ఖలీఫా.



"కొత్త కొత్వాలు అహ్మద్ ఉండగా మరొక రెందుకు? ఆయన పదవిలోకి వచ్చి నాక ఇంతవరకెవరినీ పట్టినజాడ లేదు. ఈ ముసలిదాన్ని పడితే ఆయనే పట్టాలి. ఈ పనికూడ చెయ్యలేకపోతే ఇక ఆయన ప్రజ్ఞ ఏముంది?" అన్నాడు ఖాలిద్.

ఖలీఫా అహ్మద్‌ను పిలిచి, అతనితో ముసలిదాని కథ యావత్తూ చెప్పి, ఆమెను పట్టుకోమని ఆదేశించాడు. అహ్మద్ ఆ క్షణమే తన నలభై మంది భటులతో బయలుదేరాడు. ఈ భటులపైన పెత్తందారు గూని అలీ అనేవాడు. వాడు తన యజమాని అయిన అహ్మద్‌తో, "అయ్యా, నా ఉద్దేశం, మనం ఈ ముసలిదాన్ని పట్టటంలో హసన్‌గారి సహాయంకూడా తీసుకుంటే బాగుంటుందని!" అన్నాడు.

"ఓరీ, గూనివాడా! మనకింకొకరు సహాయం చెయ్యటమేమిట్రా? మనమేనా అంత చాతకానివాళ్ళం? మరోసారి ఆమాట అన్నావంటే మక్కెలు విరగగలవు, జాగ్రత్త!" అని అహ్మద్, హసన్‌కు వినిపించేలాగా అన్నాడు.

ముసలిదాన్ని పట్టే పనికి తనను కాదని ఖలీఫా అహ్మద్‌ను నియోగించినందుకే కుళ్ళి పోతున్న హసన్, అహ్మద్ ప్రగల్భాలు




విని ఇంకా బాధపడ్డాడు. అతను తనలో, "కానీ! నా సహాయం లేకుండా ఈ అహ్మద్‌కు ముసలిది దొరికినప్పటి మాట కద!" అనుకున్నాడు.

నలభై మంది భటులనూ రాజసౌధం వెలపల మైదానం మీదికితెచ్చి, "ధీరాగ్రేసరులారా! మిమ్మల్ని నాలుగు దళాలుగా విభజిస్తాను. నాలుగు దళాలూ నగరం నాలుగు పేటలూ చక్కగా ఘాలించండి. రేపు మధ్యాన్నానికల్లా అందరూ ముస్తఫా వీధిలో ఉన్న సరాయి వద్దకు చేరుకోండి. నేను వచ్చి మీ అనుభవాలు తెలుసుకుంటాను." అన్నాడు అహ్మద్.



నాలుగుదళాలూ నాలుగువైపులా వెళ్ళిపోయాక అహ్మద్‌కూడా స్వయంగా ఆచోకీ లాగటానికి బయలుదేరాడు.

తనను పట్టటానికి ఖలీఫా అహ్మద్‌ను నియోగించటం విని దిలైలా కొంచెమైనా భయపడలేదు. ఆమె తన కుమార్తెతో, "అమ్మాయీ, నన్ను పట్టగలవాడు హసన్ ఒక్కడే. ఖలీఫా అతన్ని ఈ పనికి నియోగించకపోవటం మన అదృష్టం. ఇక అహ్మద్ మాటా? అతన్ని నువ్వయినా ఏడిపించవచ్చు," అన్నది.

"ఐతే వాళ్ళను, నేనుపోయి మోసంచేసి రానా, అమ్మా?" అని అడిగింది జీనాబ్ తల్లిని.

"అట్లాగే వెళ్ళిరా, తల్లీ!" అన్నది దిలైలా.

జీనాబ్ చాలా అందంగా అలంకరించుకుని, అతి పల్చని సిల్కు మేలిముసుగు వేసుకుని, ముస్తఫా వీధిలో హజ్‌కరీమ్ అనేవాడు నడుపుతున్న సరాయికి వెళ్ళింది. హజ్‌కరీమ్‌వద్దకు పోయి రెండు సలాములు చేసి, "కొంతమంది ఆప్తమిత్రులు వస్తున్నారు. వారు మామూలు మనుషులతో సంబంధం లేకుండా కాలక్షేపం చేస్తారు. అందుచేత మీ పెద్దహాలు ఒకరోజుకు అద్దెకిప్పించండి. అయిదు దీనారాలిస్తాను," అన్నది. హజ్‌కరీమ్, జీనాబ్ అందచందాలు చూసి, అసలు అద్దెకూడా అవసరం



లేదన్నాడు. వచ్చిన అతిథులంతా తనసారా ఖర్చుచేస్తే అదేచాలు నన్నాడు.

"దానికేమీ వచ్చుండదు. నా మిత్రులు చిల్లికపవలే అనుకోండి," అన్నది జీనాబ్. ఆమె తన ఇంటినుంచి తివాసీలూ, బాలీసులూ, బల్లలూ, కంచాలూ మొదలైన సరుకంతా మోయించి తెప్పించి, హాలులో పరిపించింది. తిండీ, తాగుడూ సిద్ధంగాపెట్టించి సరాయివాకిట కాపువేసి నిలబడింది.

కొద్దిసేపట్లోనే గూని అలీ, అతనితో మరి తొమ్మిదిమంది భటులూ ఆర్భాటంగా అక్కడికివచ్చి చేరారు. జీనాబ్ అతన్నిచూసి, "తమరేనా అహ్మద్?" అని అడిగింది.

"లేదు, నన్ను గూని అలీ అంటారు," అన్నాడు అలీ నవ్వుతూ.

"అయితే మీరంతా వచ్చి నా ఆతిథ్యం స్వీకరించండి," అంటూ ఆమె వారిని హాలులోకి తీసుకుపోయింది. వారందరూ సారా పీపా చుట్టూమూగి తాగుడు ప్రారంభించారు. అందులో జీనాబ్ భంగు బాగా కలపటంచేత త్వరలోనే పదిమందీ ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. వారిని ఒకొ్కక్కరినే ఆమె కాళ్ళుపట్టుకుని దొడ్లోకి లాక్కుపోయి, ఒకరిమీద ఒకర్ని పేర్చి పైన ఒక బట్టకప్పి, హాలు శుభ్రంచేసి మళ్ళీ తలవాకిట నిలబడింది.



కొద్దిసేపట్లోనే మరొక పదిమంది అహ్మద్ భటులు వచ్చారు. జీనాబ్ వారినికూడా ఈ విధంగానే ఆహ్వానించి, తాగించి, మత్తు తెప్పించి, దొడ్లోపేర్చి గుడ్డకప్పింది. త్వర లోనే నలభైమందికీ ఇదేగతి పట్టింది.

ఆఖరుకు గుర్రమెక్కి అహ్మద్ స్వయంగా వచ్చాడు. జీనాబ్‌ను వాకిట్లో చూసి, "ఏయ్ పిల్లా! నా భటులేమైనా కనిపించారా?" అని అడిగాడు.

"తమరు కొత్వాలు అహ్మద్‌గారా? అయితే, తమ భటులకు ఈ వీధిచివర ఎవతో ముసలిది కనిపించిందిట. ఆమెకోసం వెళ్ళామని తమతో మనవిచెయ్యమన్నారు! వారు దాన్ని పట్టుకుని వచ్చేలోపుగా హాలులోకి దయచేసి నా ఆతిథ్యం స్వీకరించమని మనవి," అన్నది జీనాబ్.

అహ్మద్ పరమానందంతో తాగటానికి ఉపక్రమించి, భంగు ప్రభావంవల్ల త్వరలోనే మొద్దులాగా పడిపోయాడు. జీనాబ్ అతని బనీనూ, లోపల వేసుకున్న చెడ్డీతప్ప మిగిలిన దుస్తులూ, ఆభరణాలూ కాజేసింది. మిగిలిన నలభైమంది భటులనూ ఈ విధంగానే దోచి, దుస్తులన్నిటినీ అహ్మద్ గుర్రం మీద వేసుకుని సరాసరి తన ఇంటికి వెళ్ళిపోయింది.

అహ్మద్, అతని నలభైమంది భటులూ కూడా రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ నిద్రపోయి, మూడోనాటి ఉదయం లేచారు. మొదట వారికి తామెక్కడ ఉన్నదీ తెలియలేదు. కాని క్రమంగా స్మృతి కలిగినకొద్దీ తమకు జరిగిన ఘోరమైన అవమానం కూడా అర్థమై భరించరాని సిగ్గు కలిగింది. దుస్తులు కూడా లేకుండా వీధిలోకి పోవటం ఎట్లాగో అహ్మద్‌కు తెలియలేదు కాని వెళ్లక తప్పదు. బనీన్లతో, చెడ్డీలతో ముందు అహ్మద్ వెనక అతని నలభైమంది భటులూ సాహసించి వీధిన పడ్డారు.

(ఇంకా వుంది)



## గొంతెమ్మ కోరికలు

ఒక రైతుకు రెండెకరాల పొలం ఉండేది. ఒకనా డాతను నాగలి తోలుకుని పొలం దున్నటానికి వస్తూండగా, ఒక కుందేలు అతివేగంగా పరిగెత్తుతూ ప్రమాదవశాత్తూ చెట్టు నొకదాన్ని కొట్టుకుని వెంటనే చచ్చిపోయింది.

"ఇదీ బాగానేవుంది. కష్టపడకుండా కుందేళ్లు దొరుకుతున్నాయి. సుఖంగా బతకవచ్చు," అనుకున్నాడు రైతు. అనాడుమొదలు ఆ రైతు నాగలి పట్టలేదు. పొలం బీడువేసిపోయింది. రోజూ చెట్టు పక్కనే కూచుని కుందేళ్లు పరిగెత్తుకుంటూవచ్చి చెట్టును కొట్టుకోవటంకోసం ఎదురుచూసేవాడు.

ఎన్నో రోజులు గడిచాయి. మిగిలిన రైతులు పంట కోసుకుని ధాన్యం ఇళ్ళకు చేర్చారు. కాని ఒక్క కుందేలుకూడా ఆ చెట్టు చాయలకు రాలేదు.

## బల్లెమూ, డాలూ

చాలాకాలంక్రితం చూదేశంలో బల్లెములూ, డాళ్లూ చేసి అమ్మేవాడొకడుండే వాడు. "నా డాలు ఒకటి కొనండి. దానిని ఏదీ ఛేదించలేదు," అని దారేపోయే వారితో చెప్పేవాడు. అదేవిధంగా తన బల్లెములనుగురించి, "నా బల్లెములు కొనండి. అవి ఎటువంటి డాలునైనా ఛేదించగలవు," అనేవాడు.

ఒకరోజున ఎవరో, "నీ బల్లెంతో నీ డాలును పొడిస్తే ఏమవుతుంది?" అని అడిగారు. చూదేశంవాడు ఏమీ చెప్పలేక తెల్లముఖంవేశాడు.





# శ్రమఫలితం

ఒకదేశంలో ఒక పేద బ్రాహ్మడుండేవాడు. ఆయన కొక చిన్న ఇల్లూ, చిన్న పెరడూ తప్ప ఇంకేమీలేదు. అందుచేత ఆయన రోజూ బయటికివెళ్లి భిక్షాటన చేసేవాడు. తనకూ తన భార్యకూ సరిపడినంత బియ్యం దొరకగానే తృప్తిచెంది ఇంటికి తిరిగివచ్చేవాడు. భార్య ఆ బియ్యం వండేది. పెరట్లో ఏదైనా కూరా, కాయా కాస్తే దానితో ఇద్దరూ భోజనం చేసేవారు.

కాలక్రమాన బ్రాహ్మడు పెద్దవాడై పోయాడు. భిక్షాటనకు పోవటంకూడా బాధే అనిపించింది. అప్పుడాయన భార్య అన్నది:

"మీరెన్నడూ రేపుగురించి ఆలోచించిన పాపానపోలేదు. ముందే జాగ్రత్తపడి ఉంటే ఇవాళ మనకీ చిక్కు లేకపోయేది. అయినా ఈ ఊరి రాజు చాలా దానశీలుడంటారు. ఎంతోమందికి దానాలు చేశాడు. మీరువెళ్లి అడగండి, ఆయన మనదరిద్రం తీరుస్తాడు."

బ్రాహ్మడు ఆ ప్రకారమే రాజును చూడబోయి ఆశీర్వచనం చదివాడు. రాజు, "ఏం కావాలో కోరండి!" అన్నాడు.

"అయ్యా, తమరు సంపన్నులు. కాని తమ సంపదలో నేను భాగం అడగను. తాము శ్రమపడి సంపాదించినది తృణమో, పణమో ఇప్పించండి," అన్నాడు బ్రాహ్మడు.

రాజుదగ్గిర చాలా ధనం ఉన్నదిగాని, అందులో ఒక్క దమ్మిడీకూడా తాను కష్టించి సంపాదించినది కాదు. ఈ బ్రాహ్మడికేమన్నా ఇవ్వాలంటే తాను కొత్తగా సంపాదించవలిసిందే. రాజు బ్రాహ్మడితో, "అయితే రేపు సాయంకాలం కనిపించండి," అన్నాడు.

బ్రాహ్మడు సరేనని వెళ్లిపోయాడు. మర్నాడు ఉదయమే రాజు మాసిన బట్టలు కట్టుకుని కూలివాడిలాగా బయలుదేరాడు. ఆయన అలా కొద్దిదూరం వెళ్లేసరికి వీధిలో ఒక కుమ్మరి కుండలు చేయబోతున్నాడు.

ఎ. ప్రభాకరరావు



"అయ్యా, నాకేమైనా పని ఇవ్వగలరా?" అని రాజు కుమ్మరిని అడిగాడు.

"పనికేం భాగ్యం? నేను సారెమీద కుండలు చేస్తాను. నువు మట్టి కలుపు. పొద్దూకేదాకా పనిచేశావంటే నాలుగు రూకలు ఇస్తాను." అన్నాడు కుమ్మరి.

రాజు సరేనన్నాడు. కాని అయనకు పని సరిగా చేతకాలేదు. మట్టి తొక్కుతుంటే ఆయన కాళ్లకు చాలాబాధ కలిగింది. శరీరం అతి త్వరలోనే అలిసిపోయింది. ఇదంతా గమనిస్తున్న కుమ్మరి "నీవల్ల కూలిపని ఏమవుతుంది? పదపద! మాట అన్నాను కనక ఇస్తున్నాను. ఇవిగో రూకలు! మళ్లీ ఎన్నడూ కూలి చేస్తానని రాకు!" అని మందలించి రాజును పంపేశాడు.

రమ్మన్నప్రకారం బ్రాహ్మడు సాయంకాలం రాజును చూడవచ్చాడు. రాజు ఆయన చేతిలో నాలుగురూకలూ పెట్టి, "ఇదే నా శ్రమఫలితం!" అన్నాడు.

"అదే నాకు పదివేలు, మహారాజా!" అని బ్రాహ్మడు రాజును హృదయపూర్వకంగా ఆశీర్వదించి వెళ్లిపోయాడు.

తనభర్త రాజుగారివద్దనుంచి బహుమతులు ఎన్ని బళ్లమీద తోలించుకు వస్తాడో అని ఎదురుచూస్తున్న బ్రాహ్మడి భార్య, తనభర్త పట్టి చేతులతో రావటం చూసి, "ఏమండీ? ఏమయింది? రాజు మళ్లీ వాయిదా వేశాడా?" అని అడిగింది.

"లేదు, దానం తీసుకునే వచ్చాను. ఇవిగో, నాలుగురూకలు!" అంటూ బ్రాహ్మడు రొండినుంచి తీసి భార్యచేతిలో పెట్టాడు.

వాటిని చూడగానే బ్రాహ్మడి భార్యకు మండి పోయింది. "కాశీవెళ్లి కొంగయాక తెచ్చినట్టు, రాజు దగ్గిరకూడా ఈ యాయవారం డబ్బులేనా తెచ్చేది?" అంటూ ఆమె ఆ నాలుగు రూకలూ పెరట్లోకి విసిరివేసింది.

అప్పటికే చీకటి పడిపోయింది. అందుచేత బ్రాహ్మడు వాటికోసం మర్నాడు తెల్ల

వారి వెతుకుదామనుకున్నాడు. మర్నాడు ఎంత వెతికినా ఆ రూకలు దొరకలేదు, కాని నాలుగు అపూర్వమైన చిన్న మొక్కలుమాత్రం కనిపించాయి.

చూస్తుండగానే ఆ నాలుగు మొక్కలూ అందంగా, ఏపుగా పెరిగాయి. త్వరలోనే వాటికి కాయలు కాశాయి. బ్రాహ్మడూ భార్యా ఆ కాయలు కోసి, ఏరుచిగా ఉంటాయో చూతామని వాటిని తరిగేసరికి కాయలనిండా ముత్యాలు కనిపించాయి! ఆ పేద దంపతులు తమ కళ్లను తామే నమ్మలేక పోయారు. ఆ ముత్యాలను తీసుకుపోయి చూపితే వర్తకులూ, కమసాలులూ అవి మేలురకంముత్యాలేనన్నారు.

ఇంతకాలానికి ఆ పేదదంపతుల దరిద్రం తీరిపోయింది. నాలుగు చెట్లూ ఎడ తెగకుండా కల్పవృక్షాలలాగా పళ్లు కాస్తూం డటంచేత వారు రోజూ ఆ పళ్లను ఊళ్లో అందరికీ దానం చెయ్యసాగారు.

కొద్దికాలంలోనే ఆపూరిరాజుకు ఈ బ్రాహ్మడి సంగతి తెలిసింది. తనను శ్రమ దానం యాచించి నాలుగురూకలు మాత్రమే పట్టుకుపోయిన ఈ బ్రాహ్మడికి ఇంతలోనే ఇలా సిరి ఎత్తుకోవటానికి కారణం రాజుకు బోధ పడలేదు. ఆయన ఆ విషయం తెలుసుకుందామని బయలుదేరి బ్రాహ్మడి ఇంటికి వచ్చాడు.

"అయ్యా, అనాడు మీరిచ్చిన నాలుగు రూకలూ నేను ఖర్చుచేయనేలేదు. నా భార్యకిస్తే ఆమె అలిగి వాటిని పెరట్లో పారేసింది. మర్నాడు అవి దొరకలేదుగాని ఈ వింత చెట్లు మొలిచాయి. వీటినుంచి మా తరతరాల దరిద్రం తీరిపోయింది," అన్నాడు బ్రాహ్మడు.

శ్రమ ఫలితం విలవ రాజుకు అర్థ మయింది. ఆ నాటినుంచి తానేగాక తన ప్రజలంతా శ్రమఫలితంపై జీవించాలని రాజు శాసనం చేశాడు.



# ప్రతీకారం

ఒక అరణ్యానికి ఒక పులి రాజుగా ఉండేది. ఈ రాజుపులికి ఒకసారి యేదో జబ్బుచేసింది. ఎన్ని చికిత్సలు చేసినా వ్యాధి నయంకాలేదు. చివరకు పులి కొడుకైన యువరాజుపులి ఒక దుర్మార్గపు ఆలోచన చెప్పింది. అరణ్యంలో ఉండే అన్ని రకాల జంతువులనూ తిన్నట్టయితే వ్యాధి నయమవుతుందని అన్నది.

రాజుపులి ఆ ప్రకారమే అన్ని రకాల జంతువులనూ రమ్మని శాసనం చేసి అన్నిటినీ వరసగా చంపి తిన్నది. అయితే రాజశాసనంప్రకారం నక్క మాత్రం రాలేదు. పులి జబ్బు నయంకూడా కాలేదు.

"మీరు తినవలిసిన జంతువులలో నక్క మిగిలిఉన్నది. దాన్నికూడా తింటేగాని వ్యాధి నయంకాదు," అన్నది యువరాజు. వెంటనే పులిరాజు నక్కకోసం కబురు పంపింది. నక్క వచ్చి ఎదట నిలబడింది.

"అన్ని జంతువులను రమ్మని మేము ఆజ్ఞాపిస్తె నువుమాత్రం ఎందుకు రాలేదు?" అని పులి గదమాయించింది.

"ఏలినవారు చిత్తగించాలి! తమ వ్యాధిగురించి నాకొక కలవచ్చింది. అది తమకు చెప్పవలిసి వస్తుందని రాలేదు," అన్నది నక్క.

"ఏమిటా కల?" అని పులి అడిగింది.

"తమరు తమ ఆత్మబంధువును చంపి తిన్నట్టూ, వ్యాధి నయమైనట్టూ నాకు కలవచ్చింది," అన్నది నక్క.

ఈ మాట వినగానే పులి, యువరాజుపులిమీద పడి చంపి తినేసింది. ఇట్లా మిగిలిన జంతువుల తరఫున నక్క యువరాజుమీద పగతీర్చుకున్నది.



# అనాకారి

తైమూర్‌లంగ్ అనే తాతర్‌నాయకుడి పరిచయం గోహాకు లభించింది. అతను కొంతకాలం తైమూర్‌లంగ్ కొలువులో ఉన్నాడుకూడా. ఈ తైమూర్‌లంగ్‌కు ఒక కాలు కుంటీ, ఒక కన్ను గుడ్డీ కావటమేగాక, మనిషి చాలా అనాకారిగా ఉండేవాడు. అయన ఒకనాడు మంగలిచేత క్షౌరం చేయించుకుంటూ, అద్దంలో తన ముఖం చూసుకుని ఏడవనారంభించాడు. పక్కనే ఉన్న గోహాకూడా ఏడుపు లంకించుకుని తైమూర్‌లంగ్ ఏడవటం మానినాకకూడా, తానుమాత్రం మానలేదు. ఇది చూసి ఆశ్చర్యపడి తైమూర్‌లంగ్, "నేను అద్దంలో నా వికారమైన ముఖం చూసుకుని ఏడిచాను. నా ఏడుపు అయినా నీ ఏడుపు అయిపోదే, నీకు ఏడవవలిసిన అవసరం యేమిటి?" అని అడిగాడు.

"ఏలినవారు ఎప్పుడో ఒకసారి అద్దంలో ముఖం చూసుకుని అంతసేపు ఏడిస్తే, ఆ ముఖం ఎప్పుడూ చూసే మేం ఎంతసేపు ఏడవవచ్చు? మీరే చెప్పండి!" అన్నాడు గోహా.

తైమూర్‌లంగ్ ఆగ్రహించటానికి బదులు విరగబడి నవ్వసాగాడు. తెలివిగల విదూషకుడి తప్పులు నూరైనా క్షమిస్తారు ప్రజలు.



# భూ గో ళ ం–3

భూగోళాన్ని జాగ్రత్తగా పరిశీలించినట్టయితే కొన్ని చిత్రాలు కనిపిస్తాయి. వాటినిగురించి తెలుసుకుందాం.

భూమికి ఉత్తర ధృవమూ, దక్షిణ ధృవమూ ఉన్నాయికదా. ఈ రెంటికీ మధ్యగా భూమధ్యరేఖ ఉన్నది. భూమధ్యరేఖకు ఉత్తరంగా వున్నదాన్ని ఉత్తరార్థ గోళమనీ, దక్షిణంగా వున్నదాన్ని దక్షిణార్థ గోళమనీ అంటారు. ఈ రెండు అర్థగోళాలనూ పరిశీలిస్తే కొట్టవచ్చినట్టు కనబడే విషయాలేవంటే : భూభాగంలో చాలా భాగం ఉత్తరార్ధ గోళంలో వుంది; జలభాగంలో హెచ్చు భాగం దక్షిణార్థ గోళంలో వుంది. అంతేకాదు—ఉత్తర ధృవాన భూమి లేదు, దక్షిణ ధృవాన, మంచుకింద, పెద్ద భూఖండం (అంటార్కిటికా) ఉంది!

ఇంతకన్న మరొక విచిత్రమైన విషయంకూడా వుంది. మాటవరసకి భూమియొక్క ధృవాలలో ఒకటి పశ్చిమ ఫ్రాన్సులోని బ్రిటనీలోనూ, రెండవది న్యూజీలాండ్ సమీపంలోనూ ఉన్నాయనుకుని భూమిని రెండు అర్ధగోళాలు చేసినట్టయితే, భూభాగంలో నూరింట 80 వంతులకు పైగా ఒక అర్ధగోళంలో ఉంటుంది; రెండవ అర్ధగోళంలో నూరింట 90 వంతులకు పైగా జలభాగం వుంటుంది!

భూమధ్యరేఖను దాటి దక్షిణంగా వ్యాపించిన ఖండాలు దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలు మాత్రమే.

భూమి ద్రవగోళంగా వుండి ఘనీభవించటం మొదలుపెట్టినప్పుడు, భూమి అంతటా తేలికైన రాతిపొర ఏర్పడివుండాలి. కాని ఇప్పుడది భూభాగం వున్న ప్రాంతాలలోనే కనిపిస్తుంది; జలప్రాంతాలలో కనిపించదు. దీనికి స్పష్టమైన కారణం ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు. చంద్రుడు భూమినుంచి వేరుపడినప్పుడు, తేలికైన రాతిపొర చాలాభాగం చంద్రుడి వెంట వెళ్ళిపోయిందని కొందరు భావిస్తున్నారు; పెసిఫిక్ మహాసముద్రం ప్రాంతంనుంచి పోయిన పదార్థమే చంద్రుడయిందని వారి నమ్మకం.

దేవదానవులు క్షీరసాగరాన్ని మథించినప్పుడు మొదట హాలాహలం పుట్టిందనీ, తరువాత అమృతమూ, లక్ష్మి, చంద్రుడూ పుట్టారనీ మన పురాణాలు చెబుతున్నాయి. పెసిఫిక్ సముద్రమే క్షీరసాగరమనుకున్నట్టయితే, ఆ ప్రాంతంనుంచి చంద్రుడు వూడి బయట పడటానికి భీభత్సమైన సంక్షోభం జరిగి, భూగర్భంలోనుంచి అపారమైన లావాద్రవమూ, మంటలూ బయలుదేరి ఉండాలి. దానినే మన పూర్వీకులు హాలాహలంగా వర్ణించివుండవచ్చు.

# పురాతన జంతువులు

పూర్వం "ఇయోహిపస్" అనే జంతు వుండేది. అది గుంటనక్క ప్రమాణంలో వుండేది. దాని మెడమీద చాలా కొద్దిపాటి బిరుసైన వెంట్రుకలుండేవి; పొట్టి తోకా, కురుచ మెడా, లేత ఆకులు నమలటానికి మాత్రం పనికివచ్చే దంతాలూ, చిత్తడి నేలలో సంచరించటానికి అనువైన పాదాలూ, ముందు కాళ్ళకు నాలుగేసి వేళ్ళూ, వెనక కాళ్ళకు మూడేసి వేళ్ళూ వుండేవి.

క్రమంగా భూస్వరూపం మారింది. చిత్తడి భూములు ఇగిరిపోయి నేల గట్టిపడింది. దానిమీద పెద్ద వృక్షాలు మొలిచాయి. "ఇయోహిపస్" కూడా మారి "మెసోహిపస్" అయింది. ఇప్పుడు దాని ప్రమాణం పెద్ద కుక్క అంత ఉన్నది. ఇప్పుడు దాని కాళ్లకన్నిటికీ మూడేసి వేళ్ళే. వాటిలో మధ్యది మిగిలిన వాటికన్న పెద్దదిగా వుండి, దళమైన గోరు కలిగి వున్నది. అది క్రమంగా గిట్టగా మారుతూ వుందన్నమాట. దాని మెడమీద జూలుకూడా కొద్దిగా ఏర్పడింది.

భూమిమీద ఇంకా మార్పులు వచ్చాయి. అడవులు నశించి పశ్చిమ అమెరికా ప్రాంతాల గరిక బయళ్ళు వెలిశాయి. "మెసోహిపస్" కూడా క్రమంగా మారి "ప్రోటోహిపస్" అయింది. దాని దంతాలు గరిక మెయ్యటానికి వీలుగా మారాయి. దాని ఎత్తూ, పరిగెత్తే వేగమూ హెచ్చాయి. వేగం హెచ్చటానికి కారణమేమంటే అది ఇప్పుడు ఒకే కాలివేలిమీద నడుస్తున్నది. మిగిలిన రెండు వేళ్ళూ నేలను అంటటంలేదు. అంతేగాక, నేలనంటే వేలికి గోరుకు బదులు గిట్ట ఉన్నది! ఈ జంతువే మరి కొంత పరిణామం చెంది మనం చూసే గుర్రమయింది.

ఏనుగుకూడా ఇలాగే పరిణామదశలు గడిచింది. ఈనాటి ఏనుగుల పూర్వీకులు 5 కోట్ల ఏళ్ళక్రితం పందులంత ఉండేవి, చూడటానికి పందులను పోలి ఉండేవి. వాటి పైదవడలలో రెండేసి వాడిఅయిన కోరలుండేవి. కాలక్రమాన ఇవి పెరుగుతూ వచ్చాయి. వాటి శరీరాలతో పాటు దంతాలూ, తొండమూకూడా పెరిగాయి.

20 లక్షల ఏళ్ళక్రితం ప్రపంచంలో చాలా భాగం మంచు కప్పి వున్న కాలంలో ఈనాటి ఏనుగుల పూర్వీకులు రెండు రకాల జంతువులుండేవి. అందులో ఒకటి జడల ఏనుగు,- రెండవది ఐరావతం (మామత్). ఒకటిమాత్రం నిజం, ఈ జడల ఏనుగులు మానవులు అవతరించేదాకా జీవించే ఉన్నాయి. రాతియుగపు మనుషులు ఇలాటి ఏనుగులను వేటాడటమే గాక వాటి స్వరూపాలను రాళ్లపై చిత్రించారుకూడా.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1956 మే సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పొందండీ దేహారోగ్యం...

రెండవ ఫోటో : ఉందండీ భావికి మార్గం!

పంపినవారు : ఎస్. కామేశ్వరరావు, ఏనుగులమహల్. (తూ. గోదావరి జిల్లా)

**బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.**




## మాయమైన స్త్రీ

ఒక స్త్రీని కుర్చీలో కూచోబెట్టి, ఆమె పైన దుప్పటి కప్పి, మాయమై పోయే లాగు చెయ్యటం అద్భుతమైన గారడీ. ఇది మొట్టమొదట యూరప్‌లో చేసి చూపబడింది. తరవాత, హెర్మన్ ది గ్రేట్ అనే అమెరికాదేశపు ఇంద్రజాలికుడు, ఈ గారడీని తనదేశంలో చాలా ఆకర్షవంతంగా ప్రదర్శించాడు.

స్టేజిమీద ఒక మామూలు కుర్చీ వేసి ఉంటుంది. దానికింద దిన పత్రిక కాగితం ఒకటి పరిచి ఉంటుంది. తరువాత ఇంద్రజాలికుడి అసిస్టెంటుగా ఉండే ఒక స్త్రీని ఆ కుర్చీలో కూచోబెడతారు. ఆమెను ఇంద్రజాలికుడు విశాలమైన తెల్ల దుప్పటితో కప్పేస్తాడు. అనంతరం ఇంద్రజాలికుడు, "ఒకటీ, రెండూ, మూడూ," అని దుప్పటి తీసేస్తాడు. స్త్రీ అంతర్హితురాలై ఉంటుంది. కుర్చీ ఉంది, దాని కింద కాగితం ఉంది, కాని కుర్చీలో ఉండవలసిన స్త్రీ మాత్రం మాయమయింది. అందరూ ఈ మాయ చూసి దిగ్భ్రమచెందుతారు.

ఈ ఇంద్రజాలం చెయ్యటానికిగాను ఇంద్రజాలికుడు ముందుగా స్టేజిని ఒక విధంగా తయారు చేసుకోవాలి. స్త్రీ అవతలికి వెళ్లిపోవటానికిగాను స్టేజి నేలలో ఒక తలుపు వుంటుంది. దాని కింద సొరంగం ఉంటుంది. అందులో మరొక మనిషి ఉండి తలుపు తెరిచి, స్త్రీ దిగి పోవటానికి సహాయపడతాడు. కుర్చీ సీటుకూడా అవసరమైతే కిందికి వాలటానికి వీలుగా, బొమ్మలో చూపిన విధంగా, ఉంటుంది. కుర్చీ వెనక భాగంలో ఒక తీగెబుట్టలాటిది ఉంటుంది. దానిని ముందుకు తీసుకు

రావచ్చు, వెనకకు వాల్చవచ్చు. ముందుకు తెచ్చినప్పుడది కుర్చీలోని స్త్రీ తలమీదకు వస్తుంది. స్త్రీ మీద దుప్పటి కప్పినప్పుడు ఆ దుప్పటి ఈ బుట్టమీదనే పడి, అది స్త్రీతలే అనే భ్రమ కలిగిస్తుంది. స్టేజి నేలలోని





సొరంగంకుండా స్త్రీ దిగి పోయినాక కూడా ప్రేక్షకులు ఆమె కుర్చీలోనే ఉన్నదనుకుంటూ ఉంటారు. పోతే, ఐంద్రజాలికుడు దుప్పటి తొలగించే టప్పుడు దానిని వెనుకనుంచి లాగే స్తాడు. అప్పుడు తీగెబుట్ట దానంతట అదే కుర్చీ వెనుకభాగానికి వెళ్ళిపోయి ప్రేక్షకులకు కనిపించదు.

ఈ లోవుగా స్టేజి అడుగుకు వెళ్ళి పోయిన స్త్రీ తన డ్రెసింగ్ రూమ్‌కు పోతుంది, లేదా ప్రేక్షకులు తనను గమనించకుండా వారి మధ్యకు వెళ్లి, ఐంద్రజాలికుడు పిలవగానే స్టేజీ మీదికి వచ్చేస్తుంది. ఈ ట్రిక్కు నిర్దుష్టంగా ప్రదర్శించాలంటే చాలాసార్లు అభ్యాసం చెయ్యాలి. ఇలాటి ట్రిక్కులు జయప్రదంగా ప్రదర్శించటానికి మంచి అసిస్టెంట్లుండాలి కూడానూ. ★

# అట్టచివరి బొమ్మ

ఒకరోజు రాజు - 3

అబూకళ్లు తెరవటం గమనించి పెద్దవజీర్ జాఫర్ సమీపానికివచ్చి సలాంచేసి, - "ఏలినవారు లేవాలి. ఉదయపు ప్రార్థనలకు వేళకా వచ్చింది!" అని విజ్ఞాపన చేసుకున్నాడు.

అబూకు ఏమీ అర్థంకాలేదు. భ్రమపడుతున్నానేమోనని కళ్లు నులుముకున్నాడు. కాని కంటి ఎదట ఉన్న దృశ్యం మాయంకాలేదు. కలకంటున్నానేమోనని చెయ్యి గట్టిగా గిల్లుకున్నాడు.



అబూకు ఏదో భయంపట్టుకుంది. అతను పక్కకు ఒత్తిగిలిపడుకుని మళ్లీ కళ్లు మూసుకున్నాడు. అతనికి కొద్ది నిద్రపట్టి మళ్లా మెళుకువ వచ్చింది. కళ్లు తెరిచిచూసేసరికి మళ్లీ అదే దృశ్యం కనిపించింది.

ఈసారి ఖలీఫాకు వేత్రధారి అయిన మస్రూర్ అతని సమీపానికివచ్చి, "ప్రార్థనల సమయం మించిపోయింది. ఏలినవారు దివాణానికి వెళ్లవలిసిన సమయం ఆసన్నమయింది!" అని విన్నవించుకున్నాడు.

అబూ చిరాకుపడుతూ, "నిజం చెప్పు. నువ్వెవడవు? నేనెవణ్ణి?" అని అడిగాడు.

"ఏలినవారు ఖలీఫా హారూన్ అల్ రషీద్. ఆస్తికులపాలిటి ధర్మప్రభువులు. ఈ అనామకుడు తమ సేవకు అర్హుడుగాని వేత్రహస్తుడు, మస్రూర్," అన్నాడు మస్రూర్ సవినయంగా.

"అబద్ధం! పచ్చిఅబద్ధం!" అంటూ అబూ ఒక బానిసను చేరబిలిచి, "నేనెవరో నీకు తెలుసా?" అని అడిగాడు.

"మా ఏలిక, ఖలీఫా హారున్ అల్ రషీద్!" అని జవాబు వచ్చింది.

అబూ అల్‌హసన్ పక్కమీద వెల్లికిలాపడి, కాళ్లు గాలిలోకి ఎగరేస్తూ

వెర్రిగా నవ్వసాగాడు. ఆ ఉన్మాదం కాస్త తగ్గినాక పరిచారికలువచ్చి అతనికి రాజరికపుదుస్తులు తొడిగారు.

కాలకృత్యాలు అయాక అబూ పరివారసమేతుడై దివాణానికి బయలుదేరాడు. "నేను అబూ అల్‌హసన్ కాకుండా, ఖలీఫాహారున్‌అల్ రషీద్‌ను ఎట్లా అయినాను?" అని అతని మనస్సు ఆశ్చర్యపడుతూనే ఉంది. కాని ఆ సందేహం తీరనేలేదు.

అబూను సింహాసనం ఎక్కించారు. పెద్దవజీర్‌జాఫర్ కొన్ని కాగితాలు తెచ్చి అతని ముందుపెట్టాడు. అబూ వాటినన్నిటినీ చూసి, తెలివి అయిన నిర్ణయాలే ఇచ్చాడు. అతన్నిచాటున ఉండి గమనిస్తున్న ఖలీఫా అతని తెలివికి చాలా సంతోషించాడు.

ఆ కార్యక్రమం పూర్తి కాగానే కొత్వాలు అహ్మద్ ముందుకువచ్చి అబూకు సలాంచేసి, "ఇవాళ ఏలినవారి ఆజ్ఞలేమిటి?" అని అడిగాడు. అబూ ఈ విధంగా చెప్పాడు:

"కొత్వాల్ అహ్మద్! ఫలానిపేటకు పాలకుడుగా ఫలాని దండనాయకుడున్నాడు. వాడికి భుజాలలాగా మరి ఇద్దరు నీచులు వాడివెంటే వుంటారు. నువు ఆ ముగ్గుర్నీ పట్టుకుని, ఒక్కొక్కడికీ ముందు నాలుగువందల కొరడా దెబ్బలు కొట్టించు. తరవాత ముగ్గురికీ మసిపాతలు తొడిగించి, గాడిదలమీద వెనక్కుతిప్పి కూచోబెట్టు. వారిని నాలుగుపేటలూ ఊరేగించి, జనమంతా వినేటట్టు, 'స్త్రీలను అవమానించేవారికి ఇదే శిక్ష! పెద్దమనుషులను గురించి నీచంగా మాట్లాడేవారికిదే శిక్ష!' అని చాటింపువేయించు. ఆతరవాత ముగ్గురినీ బహిరంగంగా కొరతవేయించు. వెళ్ళు."

ఈ ఒక్కరోజూ కొత్త ఖలీఫా ఏమి ఉత్తరువులిచ్చినా శిరసావహించవలసినదిగా అహ్మద్‌కు హెచ్చరిక జరిగి ఉన్నది. అందుచేత అతను పదిమంది భటులను వెంటపెట్టుకుని అప్పుడే బయలుదేరాడు. (ఇంకా వుంది)





# వార్తలు-విశేషాలు

ఆంధ్రరాష్ట్రంలో 1956 - 57-వ సంవత్సరంలో విద్యుచ్ఛక్తి సరఫరా పథకాలను అమలుపరచడానికి, ఆంధ్రప్రభుత్వం 56 కోట్ల రూపాయలను ఖర్చు చెయ్యడానికి వుద్దేశించింది. వచ్చే ఏడాదిలో మొత్తం 180 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా సౌకర్యాలను విస్తరింపజెయ్యాలని ప్రతిపాదించబడింది.

*                *                *                *

బొంబాయి సమీపంలోని భుయిగామ్ అనే గ్రామంలో, రెండువేల సంవత్సరాలనాటి శాసనాలు దొరికాయి. ఈ గ్రామానికి మూడు మైళ్ళ దూరంలోవున్న సోప్రా అనే గ్రామంలో, లోగడ అశోకచక్రవర్తి ధర్మశాసనాలలో తొమ్మిదవ శాసనం దొరికింది. ఈ ప్రాంతాన్నంతటినీ తవ్వి శోధించితే బౌద్ధ చరిత్రకు సంబంధించిన విశేషాలనేకం బయటపడవచ్చునని భావించబడుతున్నది.

*                *                *                *

కోయంబత్తూరులోని చెరకు పరిశోధన కేంద్రంలో, ఉత్పత్తిచేయబడుతున్న చెరకు రకాలు ప్రపంచంలోని అన్ని దేశాలలోను, పైరు చేయటానికి తగినట్టుగా ఉన్నవని, చెరకు పంటకు సంబంధించిన అంతర్జాతీయ సాంకేతిక నిపుణుల సంస్థ గుర్తించింది.

*                *                *                *

ష్వీడన్ రాజు, రాణి ఇండియాలో మూడు వారాలు పర్యటించటం నిమిత్తం ఫిబ్రవరి 16-వ తేదీన మనదేశం వచ్చారు. వారు భాక్రా ఆనకట్టను, ఆగ్రా, హైదరాబాద్, బెంగళూరు, మైసూరులను వీక్షించారు.



చేనేత వస్త్ర పరిశ్రమను ప్రోత్సహించే నిమిత్తం, సైన్యంలో కొత్తగా చేరేవారికి, ముందుగా చేనేత దుప్పట్లనే యివ్వాలని ప్రభుత్వం నిశ్చయించింది. ప్రాంతీయ సైన్యం, లోకసహాయక సైన్యం, రిజర్వు దళాలు, నేషనల్ కేడెట్ కోర్‌లకు, యికనుంచి చేనేత దుప్పట్లనే ఇవ్వాలనికూడా నిశ్చయించారు.

*　　　*　　　*　　　*

విద్యావంతులలో నిరుద్యోగ నిర్మూలనానికి, వచ్చే ఐదేళ్ళలో 130 కోట్ల రూపాయలు ఖర్చు కాగల ప్రత్యేక పథకాలను అమలుపరచాలని ప్లానింగ్ కమిషన్, నియమించిన పరిశీలన సంఘంవారు సిఫారసు చేశారు.

*　　　*　　　*　　　*

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కింద రోడ్ల అభివృద్ధి సాధనకై 55 కోట్ల రూపాయలు తాత్కాలికంగా కేటాయించబడినవి. రాకపోకల సౌకర్యాల నిమిత్తం 60 వంతెనలూ, మిగిలిపోయివున్న 600 మైళ్ళ పొడవు రోడ్లూ ప్రస్తుతం నిర్మించేందుకు ప్రణాళిక సిద్ధపరచబడింది.

*　　　*　　　*　　　*

వ్యవసాయం, పశుపోషణ మొదలైన శాస్త్రాలలో ముఖ్యమైన పరిశోధనలు జరిపినవారికి, బహుమానాలు యివ్వటానికి ఒక పథకం తయారుచేయబడింది. కేంద్ర వ్యవసాయ శాఖా మంత్రి డాక్టర్ పంజాబ్‌రావ్ దేశముఖ్ అధ్యక్షతను ఢిల్లీలో సమావేశమైన భారతీయ వ్యవసాయ పరిశోధనా మండలి స్థాయీసంఘం, ఈ పథకాన్ని పరిశీలించి ఆమోదించింది.

*　　　*　　　*　　　*

ఇండియా ప్రభుత్వం విద్యాశాఖా మంత్రి మౌలానా అబుల్‌కలాం అజాద్ సోవియట్ రష్యా విద్యాశాఖా మంత్రి ఆహ్వానంపై వచ్చే జూలై నెలలో రష్యాకు వెళతారు.

*　　　*　　　*　　　*

శ్రీ వి. కె. కృష్ణమీనన్ ఇండియాప్రభుత్వ మంత్రిగా నియమించబడ్డారు. ఈయన వయస్సు 59 సంవత్సరాలు. వీరు గత రెండు మూడు ఏళ్ళనుంచి మిత్రరాజ్య సమితిలో భారత ప్రతినిధి వర్గానికి నాయకుడుగా వున్నారు.



# చిత్రకథ



ఒక సెలవురోజున దాసూ, వాసూలు స్నేహితులతో తోటలోకి వెళ్లారు. వాసు తనదగ్గిరున్న బంతిని కర్రపుల్లమీద బ్యాలెన్స్‌చేశాడు. ఆ తరవాత దాసు దాన్ని ముక్కుమీద నిలబెట్టాడు. స్నేహితులంతా భలేభలే అంటూ చప్పట్లు చరిచారు. ఇదంతా చూస్తున్న "టైగర్" ముందుకు రాగానే దాసు దాని ముక్కుమీద కర్రపుల్ల వుంచి, అటొక బంతీ, ఇటొక బంతీ పెట్టాడు. 'టైగర్' అచ్చుగా సర్కస్ కుక్కలా తన ముక్కుమీద వాటిని బ్యాలెన్స్‌చేసి అందరినీ ఆశ్చర్యపరిచింది.



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

"నా చర్మ రక్షణకు
నిర్మలమైన సబ్బు అగత్యము!"

మైసూరు చందన సబ్బు యొక్క పరిమళ, ఓషధీగుణాలు బిడ్డ శరీరమును పూర్తిగా పరిశుభ్రము చేయుటయే గాక, లేతచర్మము చిట్లి బాధించకుండ చేయును.



'my skin needs
a pure soap!"



## మైసూరు చందన సబ్బు

గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ
బెంగుళూరు
(మెంబర్ ఐ. ఎస్. టి. ఎమ్. ఎ.)

# ప్రెసిడెంట్

టాయిలెట్ వస్తువులలో
అగ్రేసరము!

**ప్రెసిడెంట్ వెజిటబిల్ హెయిరాయిల్** చక్కని శిరోజములను పెంచును.
**ప్రెసిడెంట్ స్నో** లాలిత్యమును పెంపొందించును.
**ప్రెసిడెంట్ టాల్కమ్ పౌడరు**
శరీరమునకు అందమైన వర్చస్సు నిచ్చును.






RATHOD TRADING CO · SOWCARPET · MADRAS · 1

"ఆహా, ఎంత చక్కని
చిత్రము! దానిని
యింటిలో ఎలా
తీయగలిగేవు?"





"నేను క్రొత్త
కోడక్ 'ట్రై-ఎక్స్'
ఫిల్మ్ ఉపయోగించేను
—అది అన్నిటికంటె
అత్యంత వేగమైనది."

కోడక్ 'ట్రై-ఎక్స్' ఫిల్మ్‌తో మసగ వెలుతురులో మీరు ఉత్తమ చిత్రములు నిశ్చయముగ తీయవచ్చును. అది కోడక్ 'సూపర్-ఎక్స్‌ఎక్స్' ఫిల్మ్‌కన్న కనీసము రెట్టింపు వేగమైనది.

మీ కెమేరాలో 'కోడక్' ఫిల్మ్ వాడితే చిత్రములు తీయుటకు తొందరలు ఉండవు. ఒకటి వాడుటకు, రెండవది చేతికాపుగా ఉంచుకొనుటకు ఎల్లప్పుడూ రెండు రోలుల




కోడక్ లిమిటెడ్
(ఇంగ్లండులో స్థాపితము)

Photo by P. K. Patel



బహుమతి
పొందిన వాక్యం

ఉండండి భావికి మార్గం !

పంపినవారు :

